# వి ష య సూ చి క

# మ న వి

ఈ మహాసభావృతయందు నాకుగల కృతజ్ఞత వెల్లడించుకోవాలనే నా ఆశయం. శ్రీ శాస్త్రీ కృష్ణాచార్యుల ఉపన్యాసం గురించి, ఒకమాట. వారియందు నాకు గురుభావం, వారికి నాయందు ప్రత్యేకవాత్సల్యం--అని ప్రతిశిష్యుడూ అనుకో గలిగినట్లే నేనూ అనుకుంటాను. వారి ఆజ్ఞచొప్పున వారి ఉపన్యాసం నా సంపుటిలో ప్రకటించుకుంటున్నాను. వారి సంభాషణ అనంతరం కొన్ని నెలలకి నేనది లిపించి ప్రకటించడంవల్ల అది మీదేఅని వారు శాసించగా, నేను తిరుగాడ లేకపోయాను. 1—5 లు "ఆంధ్రపత్రిక" లో పడ్డాయి. "కృష్ణాపత్రిక" లో, 3-రెండుసార్లుపడింది, 6-ఒకసారిపడింది. 4-నవ్యసాహిత్య పరిషత్ పత్రికలో 1943 లో పడింది. ఆయా అధిపతులకి కృతజ్ఞుణ్ణి. 7-వచన 1947.

గ్రంథకర్త.

# ఆంధ్ర అక్షరుడు

అమృతాంజనమును స్పర్శవేదిగా చేసుకున్నాడు. ఆంధ్ర పత్రిక పూరించి ఆంధ్రమును మేల్కొల్పినాడు. ఇంద్రియ నిగ్రహము అలవరచికొన్నాడు. ఈశ్వరార్పణ బుద్ధితో పని చేసినాడు. ఉగాది సంచిక ప్రారంభించినాడు. ఊష్మలుడు. ఋషితుల్యుడు. ౠ యొక్క పేదరిక ధనార్థములు తెలిసి ధైర్యమవలంబించినాడు. ౡ గురించిన స్వార్థమే గ్రహించినాడు. ఎకుబారీవాడు. ఏమగడ అయి ఒక్కడును ఆంధ్రమును నిలబెట్టినాడు. ఐశ్వర్య సంపన్నుడు. ఒరవడిగా ఉండతగ్గవాడు. ఓటమి యెఱుగనివాడు. ఔపనిషదుడు. అం వంటి సగము వ్యాపారము తెలియనివాడు. అంతఃకరణ శీలుడు. అః ప్రకారము సిద్ధమంత్రముగ కాంగ్రెసు సందేశమును మన్నించినాడు.

కర్మయోగి యైన కళాపోషకుడు. ఖండాంతరములలో సహా వ్యాపారము చేసినవాడు. గంభీరుడైన గడుసరి. ఘనుడు. ఙ (ప్రజా) సేవకుడు. చతుర్భాగ్యసంపన్నుడు. చదువుల రక్షకుడు. ఛత్రలక్షణుడు. జనాశ్రయుడు. జన్నిగట్టులలో త్యాగి. ఝుష్కరక విశ్వదాత. ఞ (దేశ) కల్యాణమొనగూర్చినవాడు, టంకార మార్జించినవాడు, ఠవర అనిపించుకొన్నవాడు. డంబరహితుడు. ఢక్కాముక్కీలకి ఆగి

పైకొచ్చినవాడు. ణ (కృపా) సముద్రుడు. తన యిల్లు ప్రజలకు తల్లియిల్లు చేసినవాడు. థ (కొండ) యంత చుట్టము ప్రతివ్యక్తికిని అయిన వాడు. దయాపరుడు. ధన్యధనికుడు. నహీ అననివాడు. పరోపకారజీవి. ఫలానా ఆంధ్రుడు అని పేరుగాంచినవాడు. బహుధాన్య సంకలితుడు. భగవద్గీతార్థ సంగ్రహాసక్తుడు. మనీషియైన మహాశయుడు. యశోవిశాలుడు. రసగ్రహణ పారీణుడు. లఘ్వాశి. వర్తమానకాల ప్రియుడైన వదాన్యుడు. శంభువర ప్రసాదుడు. షడ్దర్శన పరిజ్ఞాత. సదాగతుడై దేశముకొరకు తిరిగినవాడు. హరిజనోద్ధారకుడు, ళ–మధ్యమము ఊహించుకో గలిగినజాతివాడు. క్షయవల్ల అక్షయమందినవాడు–

శ్రీకాశీనాథుని నాగేశ్వరరావు! ఏడీ అట్టివాడు!!

(రచన 2–10–1938 నాటిది)

—

# చిలకమర్తి లక్ష్మీనరసింహం

[30—10—1938 తేదీని రాజమహేంద్రవర పురమందిరంలో సమావేశం. సభాధ్యక్షులు, శ్రీ పెద్దాడ రామస్వామిగారు]

అధ్యక్షా! సభ్యులారా! పండితు లందరికీ నమస్కారం. ప్రస్తుతం మట్టుకి పామరులకి నేను నమస్కారం పెట్టవలిసిన అగత్యమే కనిపించటం లేదు. ఎంచేతంటే, ఇక్కడ పామరులు లేరు. ఈ జయంతి మహోత్సవ సందర్భంలో బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి సమక్షంలో వార్ని గురించీ వారి రచన గురించీ ప్రసంగం చెయ్యడానికి నన్నుకూడా కోరినందుకు కార్య నిర్వాహక సభవారికి వందనాలు.

తెలుగు భాషకి అలంకారాలు పెట్టి కానుక లర్పించిన వాళ్ళల్లో ఆయన ఒకరు. అవి చదివే టప్పుడు నేను ఏరీతిగా ఆనందించి ఉన్నానో కొంచెం ముచ్చటిస్తాను. నాకు కవిత్వం ఎంత రాదో విమర్శించడం అంతే రాదు. మరెందుకయ్యా ఇక్కడ నిలబడడమూ అంటే, వారియందు నాకు గల భక్తి గౌరవాలవల్ల; తమ దగ్గిర ఉండే క్షమాదరణలు చూసుగుని.

ఆయన నడుపుతూవచ్చిన పత్రికలూ, ఇస్తూ వచ్చిన శందర్భోపన్యాసాలూ, చేస్తూ వచ్చిన ప్రసంగాలూ, పాత

కాలల నిమిత్తం వ్రాస్తూ ఉంచిన పుస్తకాలూ, కాక ఆయన రచన 1927 సం॥లోనే పది సంపుటాలుగా వెలువడింది. వాటిల్లో నవలలు, నాటకాలు, వ్యాసాలు, చరిత్రలు, కథలు కమామిషులు—రకరకాలు ఉన్నాయి.

గ్రంథాలు మనుషులు ఆదరించాలనే ఆశతో రాస్తారు. న్యాయతః రాయాలి. అందులోనూ, గతించిన వాళ్ళనీ జనించని వాళ్ళనీ మినహాయించి సమకాలికుల్ని ఉద్దేశించి రచించాలని కొందరు అంగీకరిస్తారు, కొందరు అంగీకరించరు. కాని, అన్ని గ్రంథాలూ అందరూ చదవరు. ఒక్కొక్క గ్రంథం కొందరి కొందరి హస్తం అలంకరించడానికే వెలుస్తుంది. అది ఆ కాసిని మందినీ ఆకర్షించగలిగినా ధన్యే! కడంవాళ్ళని ఆకర్షించలేకపోతినే అని ఆ రచయిత బాధపడకూడదు. 'పండిత పామర హృద్యం' అనేది పుస్తకాల ఉపోద్ఘాతాలలో దొరికే నిత్యకృత్య సమాసం. పండితుడు మెచ్చేది పామరుడికి తెలియదు, పామరుడు మెచ్చేది పండితుడు నిరసిస్తాడు ఇది ఎప్పుడూ ఇల్లానే వస్తోంది. నచ్చినప్పుడుగాని మెచ్చరని మనం ఒప్పుగోవాలి. ఒప్పుగుంటే, ఇది నువ్వెందుకు మెచ్చుగున్నావనిగాని, ఇది నువ్వెందుకు మెచ్చుగోవనిగాని ఒకడు ఇంకొణ్ణి అడగడానికి వీలేలేదు. పామరులు అనేకులు గనక పామర హృద్యం అయిన గ్రంథానికి విహార రంగం విస్తారంగా ఉంటుంది. కాని, జన రంజకత్వాన్ని బట్టి కృతియొక్క

ప్రాశస్త్యం కొలవలేం. అయితేం, జనరంజకత్వం ఉత్త పుణ్యాన్ని బయల్దేరదు. డబ్బోసి కొనుక్కున్న జనరంజకత్వం కర్త కళ్ళముందే దివాలా తీస్తుంది. ఇన్ని యిల్లా ఉండగా, జనరంజకత్వం గల ఒక్కొక్క గ్రంథంలో పటుత్వం ఈషణ్మాత్రమూ లేదనడమూ, పైగా లక్ష తప్పులున్నాయని చప్పుడు చెయ్యడమూ పండితుడికి కొంతవరకు పైత్యశాంతి అల్లాంటి పండితుల్తో పట్టుగుని వర్ణించవయ్యా నీ పాకమూ అంటే, అది వేరుసంగతనడం, లేక ఒకవేళ రచించడం జరిగితే అది ఏ జనుడూ చూడకపోవడమూ, ఏమయ్యా నీకృతి ఇల్లా అయిందీ అంటే 'జనం అంతా ఒకటో రకమైన మూర్ఖులు' అని ఆయన కనిపెట్టినట్టు చెప్పడమూ తటస్థిస్తుంది. జనరంజకత్వం గల కృతుల్లో ప్రత్యేక లక్షణాలు గోచరిస్తాయి, కాని ఆ లక్షణాల ప్రకారమే పాళ్ళువేసి గుండ కొడితే సిద్ధించే కృతికి జనాకర్షణ ఉంటుందని పూచీ పడడం ప్రమాదం. రచించే వ్యక్తికి త్రికరణశుద్ధీ, నిశితమైన బుద్ధీ, ఇయ్యతగ్గ సందేశమూ, ప్రకటిస్తేగాని ఊరుకో నియ్యని ఉద్రేకమూ, అర్హమైన కథావస్తువూ, దానికి తగ్గ రచనారూపమూ, అందుకు తగ్గ భాషా—వీటి లెఖ్ఖేముంది, దైవానుకూలమూ! ఎన్నో ఏకమైతే గాని జనాకర్షణగల కృతి సిద్ధించదేమో అనిపిస్తుంది.

లక్ష్మీనరసింహంగారి కృతులు జనాన్ని ఆకర్షించడం నిర్వివాదాంశం. జనహృదయాన్ని తట్టగల విశేషం రచనలో ఒకటిఉన్నా చాలు, ఆకర్షణకి. అనేకం ఉంటే, అడిగారా! మొదటి విశేషం—ఆయన ఎన్నివేల వాక్యాలైనా అనేశారుగాని లిఖించలేదు. అనగా ఆయన అంధత్వంవల్ల ఆయన రచనంతా తాను అనుభవించి అనెయ్యవలిసిన అవసరం ఏర్పడింది, తప్పనిసరివల్ల మేధారచన మానేసి హృదయరచన ఆయన చెయ్యవలిసొచ్చింది. అందువల్ల రచన యావత్తూ సహజంగానూ, సరళంగానూ, అప్రయత్నంగానూ, సూటిగానూ, అనర్గళంగానూ బయల్దేరి సాగింది. లేకపోయిన పక్షాన్ని, ఆయనకున్న ధారణకితోడు నిఘంటువులూ వ్యాకరణాలూ సంప్రతిస్తూ కవిత్వం గనక ఆయన కట్టిఉంటే, ఆయన రచనలో చాలాభాగం నాబోటి వాడికి కొరుకుపడని నారికేళపాకంలో బందోబస్తు అయి ఉండిపోను. రెండో విశేషం—ఆయన కొన్నేళ్ళపాటు చేసిన మేష్టరీ ఆయన రచనకి సుబోధకత్వం తెచ్చి ఆకర్షణ కలిగించి ఉండవచ్చు. మూడో విశేషం—ఉపమానం లేకుండాగాని, సామ్యం చెప్పకుండాగాని పర్యాయభావం దొర్లకుండాగాని, ఆయన రచన నడవదు. ఆకర్షించడం వీటి లక్షణం. నాలుగో విశేషం—ఆయన మొట్ట మొదట్లో కీ॥ శే॥ ఇమ్మానేని హనుమంతరావు నాయుడు గారితో కలిసి నాటక ప్రమేయం పెట్టుగోడం. ఎందుకనగా, నాటక

రచనలో చిగురంటా ప్రయోగింపబడే ప్రతీమాటా జనానికి తెలిసి వాళ్ళని కూచోపెట్టేది అయి ఉండాలి. జనం అంటే మళ్ళీ ఎల్లాంటి జనం—అక్షరాలు రానివాళ్ళూ, వచ్చి మరిచి పోయినవాళ్ళూ, పెద్ద పెద్ద చిన్నలూ, చిన్న చిన్న పెద్దలూ, పంచరంగుల చిత్రాలు! పైగా, టిక్కట్టుఉంటేం ఊరికే వెడితేం, సజీవులు! అయినో విశేషం—సంభాషణఅనేకులకి గమ్యాంగనక ఇష్టం. అది సారస్యాంగానూ సహజంగానూ ఉన్నకొద్దీ, ఎక్కువ మందిని కలుపుతుంది. ఆరో విశేషం—కథ అంటే మానవులు నోరూరతారు. అందులో మహత్తరమైన కథ పట్లు ఉన్నకొద్దీ, కల్పనా చమత్కృతి ఉన్నకొద్దీ, పర్యవసాన గూఢత్వం ఉన్నకొద్దీ జనం పోగవుతారు. చివరి విశేషం—హాస్యం కూడా మానవులకి సరదా. అది అవసరమైనదై, సభ్యమైనదై, ఈర్ష్యా రహితమైనదై ఉంటే జన హృదయాల్లో వ్యాపిస్తుంది. లక్ష్మీనరసింహంగారి రచనల్లో ఈ లక్షణాలు అన్నీ ఉన్నాయి. అవి రచనల్ని విభజన చెయ్యడానికి అనుకూలిస్తాయి.

ఆయనకి పద్యకవిత్వం అంటే ఉండే ఆసక్తి కంటె నాటకత్వం అంటే ఎక్కువ మక్కువలా కనిపిస్తుంది. సంస్కృత కావ్యాల్లో ఆయన మెచ్చేది 'రఘువంశం.' అది ఏకైకాక్షర సారస్యం గలిగి ఉన్నదనిన్నీ పూర్వోత్తర రామాయణ గాథ అయి ఉండడం చేతనున్నూ దాన్లోఉండే అఖండ భావాలు తెలుగు వాళ్ళకి ద్యోతకం చెయ్యడానికి ఆయన

రఘుకులచరిత్ర రాశారు. సంస్కృత నాటకాల్లో ఆయన మెచ్చేది 'శాకుంతలం' కాని, ఆయన నాటకత్వాభిరామ ఆయన్ని భాసుడికేసే తిప్పింది. కథలో తన చిత్తం వచ్చిన నూతన సంఘటనలు కల్పించుకోడానికి భాసుడు పురాణాన్ని మార్చేస్తూండడం ఆయన మెచ్చి ఉంటారు. స్వంతంగా కల్పించిన నాటకాలు గయోపాఖ్యానం, ప్రసన్న యాదవం ముఖ్యమైనవి. ఓ, ఏమి గయోపాఖ్యానం! లక్ష్మీ నరసింహంగారి పేరు విని ఉండనివాళ్ళు ఉంటే ఉండవచ్చు గాని, గయోపాఖ్యానం ఎరగని వాళ్ళుండరు అనాలి. అందులో వచ్చే 'అల్లుడారమ్మని' అనే సీసపాదంలో సందర్భించే 'పంపుమామ' తో పరిచయం లేనివాళ్ళు అష్టాదశ వర్ణాల్లోనూ దొరికేవారా? ఒకసారి రాత్రివేళ లక్ష్మీ నరసింహంగారు భీమవరంనించి వీరవాసరం వెళుతూంటే బండివాడు ఆయన ఎవరో తెలియకుండానే ఆ పద్యమే పాడి ఆయన్ని వినోదపరిచాడని ఆయన అన్నారు. గయోపాఖ్యాన గ్రంథం ఒక లక్ష పాతికవేల ప్రతులు అమ్ముడైంది. అన్ని ప్రతులు చెల్లిన ఇతర తెలుగు పుస్తకం పేరు ఇప్పటికి నాకు తెలియదు; ముందుముందు తెలిస్తే తెలియవచ్చు. గయోపాఖ్యాన ప్రయోగం ఎన్ని లక్షల ప్రజలు చూసి ఉంటారో మదింపు వెయ్యడం జరగవలసింది. అయినా, అందులో ఊడిపడ్డది (ఉమ్మి తప్ప) ఏమీ లేదనిన్నీ, తప్పులున్నాయనిన్నీ, కాని నాటుదనం గ్రహింపు లేక ప్రయోగం చూడ

జానికి ఎగబడతారనిన్నీ అభిప్రాయం ఉండేది. ఉండచ్చు. ఆ అభిప్రాయం బదులు అందులో మహాంశం ఏమీ లేక పోయినా, తప్పులున్నా, అన్ని లక్షల మంది గ్రంథం చదివి ప్రయోగించి చూసి ఆనందించడం అనేది రూఢి అని మనకి తెలిసినప్పుడు, అందుకు కారణం ఏమిటో మనం గమనించడం మంచిది. పైన సూచింపబడ్డ సద్యస్ఫురణవంటి లక్షణాలు ఉండడమూ, పాత్రలు భారతవీరులు కావడమూ, ఏ యితర నాటక కథలోనూ వలలు వేసి వెతికినా దొరకని సమాన ఉర్జీలకలహం ఇందులో ఉండడమూ, పట్టింపులు పోయేవారు నరనారాయణులు కావడమూ, ఒక్క ఉమ్మితో చిత్రంగా యుద్ధం అంతపని జరగడమూ తోడ్పడి, గయోపాఖ్యానానికి జనం హృదయం మీద ఎంతో ప్రభావం కలగజేశాయి. తెలుగు గ్రంథాలన్నింటిలోనూ లక్ష్మీనరసింహం గారికి భారతమే ఇష్టం అని సెలవిచ్చారు. అది ఓ నూటాభైసార్లు ఆయన చదివి ఉండవచ్చునన్నారు. భారతంలోకల్లా మీకు నచ్చిన పద్యం ఒక్కటి మాత్రమే చెప్పండి—అంటే మీరు ఏ పద్యం చెబుతారని ఆయన్ని నేనడిగాను. చెప్పడం బహు కష్టమన్నారు. 'బహు' కాదండి అన్నాను. 'వాడిమయూఖముల్ గలుగు వాడపరాంబుధి గ్రుంకె' అన్నారు. 'మరి తిక్కనలో' అని నేననబోతూంటే నన్ను అడ్డి, 'వరమున బుట్టితిన్ భరతవంశము జొచ్చితి' మొదలైన పద్యాలు వరసని పఠించారు. భారత ప్రీతి ఆయన రచనల

కొన్నింటిలో అంతర్వాహిని. సౌందర్యతిలక యొక్క కథా వస్తువులో జరాసంధవధ ఉంది. ప్రచ్ఛన్నపాండవం యొక్క మొదటి ప్రకరణం ఆది సభాపర్వాల సంగ్రహం. తరవాత దుర్యోధనుడు చారశిఖామణిద్వారా విరటుడి కొలువులో ఉన్న పాండవుల సంగతి కనిపెట్టడం మొదలైనవి ఉన్నాయి. శాంత్యనుశాసనిక పర్వాలలో అంపశయ్య మీద నుంచి భీష్ముడు ఇతిహాసపూర్వకంగా మాట్లాడేసిన అఖండవిషయాలు పిల్లలకి కూడా తెలిసేలాగు ఆయన భారతకథామంజిరి రచించారు.

లక్ష్మీనరసింహంగారి రచన మీద ప్రసంగించే ముందు పద్యగద్య సృష్టిగురించి కొంచెం అనాలి. కష్టమూ తేలికా అనేవి వ్యక్తిని బట్టి ఉండేవే అయినా, పద్యంలో నియమాలు ఎక్కువగనక, పద్యరచన అనేసరికి 'అబ్బో!' అని లెంపలు వేసుగుని, గద్యరచన అనగానే 'సరేలేస్తూ', అనేసి అనేకులు పద్య సృష్టియొక్క సరంజాంలోకి జొరబడలేక, పద్య రచన యొక్క గొప్పతనానికి యోగ్యతాపత్రం ఇచ్చేస్తారు. కాని, పద్య సృష్టిలో అంశం శూన్యం కావచ్చు, ఇస్త్రీ మడత సమాసాలు స్వంతానికి భుక్తపరుచుగోడానికి వీళ్ళున్నాయి, పురాణ సంప్రదాయ స్ఫురణల్తో పద్యపాదాల్నే కాదు పద్యోదరాన్ని కూడా నింపెయ్యచ్చు, వింతభావవాడి అది సంత జనానికి బోధపడకపోతే ఉరెట్టుగోమన్నారా అనవచ్చు, గనక పద్యసృష్టే. చాలా తేలిక అనే గద్యవాదులు

ఉండగలరు. గద్యం ప్రతీవాడూ రాయగలడుగాని పద్యం నూటికీ కోటికీ ఒకడు చొప్పునగాని రాయలేడు గనక, పద్యపదవే ఉన్నతం అని పద్యప్రియులంటారు. దీన్నించి, అందరూ చెయ్యగలిగిన కృతి మనమూ చేసి జనాకర్షణ చెయ్యడం ఉత్కృష్టమూ, లేక ఏ స్వల్ప సంఖ్యాకులో చెయ్యగలిగినలాంటిది మనం చేసి జనాకర్షణ చెయ్యడం ఉత్కృష్టమూ అని తర్కించవలసొస్తుంది. తర్కిస్తే ఎల్లరూ చెయ్యగలిగిందే చేసి దాన్తో వాళ్ళని ఆకర్షించడమే ఎక్కువ సామర్థ్యం అని అంగీకరించవచ్చు. ఎంచేతంటే, అది ఎల్లా నచ్చుతుందో ఎవడి మట్టుకివాడు, మధ్యవర్తి ఆశ్రయింపు అక్కర్లేకుండా తినంతట తనే చూసుకో గలడు గనక! క్రియముక్క, దేనికష్టం దానిదైనప్పుడు పోల్చడమే పొరపాటు. పద్య గద్యాలు పెరుగు మజ్జిగల సంబంధం వంటిది కలిగి ఉంటాయని మాత్రం ఒప్పుగో వచ్చుననీ, జీవం అనేది రూపమాత్రమే కాదు గనక రూపం గురించిన పట్టింపులు వ్యర్థం అని నా నమ్మకం అనీ చెబుతూ, మరి కథలో పడతాను.

లక్ష్మీనరసింహంగారి రచన సహజం. ప్రయత్నరహితం. వారి రచనకి వేగమూ ప్రసాదమూ లక్షణాలని చెప్పవచ్చు. ఉపన్యాసధోరణి ఆయనకి అభిమానం అయినవి. నవలల్లోని పాత్రల ప్రసంగాలు ముగిసిన తరవాత, 'అని యుపన్యసించి' అని ఉంటుంది. సాటిభావం లేందే ఏ పరిచ్ఛేదమూ

పూర్తి కాదు. రెండేసి నాలుగేసి సజాతీయ భావాలు ఊపిరి సలపకుండా తగుల్తూంటాయి. అప్పుడు నాకు 'అర్జునుండు శత్రువుపై నాల్గమ్ములేసె' మొదలైనవి జ్ఞప్తికి వస్తాయి. అవి జోడుగుళ్ళ బారులాగ అల్పమనస్సుల్లోకి కూడా ప్రవేశిస్తాయి. ఆ శైలి చదువరి మనస్సుని చుట్టబెట్టేస్తుంది. తెలుగు వాడికి తెలుగు సంప్రదాయమూ తెలుగు నుడికారమూ తారసిల్లి స్వాగతం ఇస్తూన్నట్టు తోస్తుంది. పూర్వగాథ ఏదేనా సందర్భంలో ఆయన ఎత్తుకున్నప్పుడు ఒక పేరో ఒక మాటో కాదు ఒక వాక్యం—ఆ గాథలో ఉండే వివరాలతోసహా ఆయన దాన్ని ఆనందించిన రీతిని స్ఫురింపజేసే వాక్యం—ఉంటుంది. అదే తెలియని వాళ్ళకి లీలగా బోధించే పట్టు. పేజీలకి పేజీలు వెతికినా పడికట్టు శీల సంతనా సమాసాలు కనిపించవ్. 'ఆశా మయ్యపాయి' అనేది వచ్చినట్టుంది. ఆ కాస్త ఒకటీ కుడా కట్టుబడో పురాకృతమో చెప్పలేను. అర్థంలో చాలా దూరంగా ఉండే రెండు భావాల్ని ఏక వాక్యంలో చెప్పే టప్పుడు వర్ణవైరుధ్యం కలిగిన శబ్దాలు కుడా ఆయన ప్రయోగించి విశేషమైన అర్థజ్ఞానంలేని పామరుణ్ణి కూడా తనవైపు లాక్కోగలరు. ఆయన శైలియొక్క ప్రవాహం అనర్గళమూ అవ్యాహతమూనూ! తెలుగు చెవలకి చాలా పరిచయంగల తేట మాటలు ఇట్టెట్టే పోగుచేసి ఆ కలయికతో దట్టంగా పడే చిత్రం చదువరి మనస్సులో ముద్రించగల నేర్పు

ఆయన రీతిలో ఉంది. ఏ పాత్ర ఏ పరిస్థితుల్లో ఉంటే ఆ పాత్రతో తను ఐక్యమై ఆ పాత్రచేత తన చిత్తవృత్తిని ఉపన్యసింప జెయ్యగల సామర్థ్యమూ ఆయనలో ఉంది.

లక్ష్మీనరసింహంగారు, దేశభక్తి హృదయంలో మిలమిల లాడిపోయిన తెలుగు కవులలో ఒకరు.

> "భరతఖండంబు చక్కని పాడియావు
> హిందువులు లేగదూడలై యేడ్చుచుండ
> తెల్లవారను గడుసరి గొల్లవారు
> పితుకుచున్నారు మూతులు బిగియగట్టి."

అనే ప్రసిద్ధ పద్యానికి ఆయనే కర్త. కాని, ఒకరి దేశభక్తి మరొకరి కంటికి అపరాధం! అందుచేత లక్ష్మీనరసింహంగారు చిరకాలంపాటు అపరాధ పరిశోధ శాఖవారి జాబితాలో ఉంటోచ్చిన కవి. దేశభక్తి ఎల్లరి హృదయాల్లోనూ పొంగి పొరిలి పోవాలనే ఉద్దేశంతో ఆయన రాజస్థాన కథావళి రాశారు. భారతీయుల ధైర్యసాహసాలూ, దేశాభిమాన స్వాతంత్ర్యేచ్ఛలూ, పాతివ్రత్య వీర పత్నిత్వాలూ ఆ అద్భుత చరిత్రల్లో హృద్యంగా వర్ణింపబడ్డాయి. లక్ష్మీనరసింహంగారి మతం మాహాత్మ్యాన్ని ఆరాధించడం. సహస్రముఖ దృష్టితో గ్రంథరచన చేసి గద్యతిక్కన అనిపించుకున్న వీరేశలింగంగారు, లక్ష్మీనరసింహంగారికి మార్గదర్శి, గురువు.

ఆయన పెంచి పోషించిన తెలుగు గద్యకి ఈయన కూడా యథాశక్తి దోహదం చేసి, ఆయన యత్నించిన రచనా రూపాలన్నింటినీ తానూ యత్నించి, తెలుగు జనం తమ చిత్తవృత్తుల్లో కలిగే మార్పులు ఎంతెంత సున్నితంగా ఉండేవైనా సరే అన్యహృదయాలకి తట్టేలాగ శ్రమ లేకుండా మాటల్లో చెప్పుకోవచ్చును—అని ఋజువు చేశారు. ఎక్కడైతే డాంబికం, హృదయశూన్యత్వం, పటాటోపం, ప్రచార నిమిత్తమైన బాహ్యారాధనా, క్రియాశూన్యత్వమూ కనిపిస్తాయో అక్కడల్లా హేళన చెయ్యాలని వీరి ఉద్దేశం. వీరేశలింగంగారి అభిప్రాయమూ అంతే. ఎటొచ్చీ, వారి హేళన తీవ్రతరం. మాహాత్మ్యాన్ని మనసారా పూజించాలని వీరి సంకల్పం. బౌద్ధమతంలో ఉండే భూతదయాలక్షణంతో వీరి హృదయం కరిగి పోవడంవల్లే సిద్ధార్థచరిత్ర పుట్టింది. కర్పూరమంజరి లో ఆ మతం గురించి ప్రశంస వచ్చింది. బాహ్యవేషంలోనూ శుష్కవాదంలోనూ అసలు విషయాలు చిక్కుపడ్డప్పుడే వాటిని విడగొట్టే పరమహంసలు బయల్దేరి పరమార్థబోధ చేశారని వీరి నమ్మకం. అందువల్ల, వారివారి చరిత్రలూ వారి వారి ప్రత్యేక బోధలూ జనానికి ఈయన అందించారు. దేశాభిమానమూ, వీరపూజాసక్తి వెల్లివిరిసే టట్టు భారతవీరులు రచించారు. ఆర్థిక రాజకీయాలలో అభిలాష సుధాశరశ్చంద్రం అనువదించి చూపించారు.

ప్రహసనాలు పెద్దగ్రంధాలకి సత్తరకాయలు! కామాది వర్గంవల్లా అహంకార మమకార అధికార ధిక్కార జాడ్యాలవల్లా పేట్రేగిపోయిన జనానికి నలుగురూ నవ్వి పోవడం అనే సంఘ శిక్ష పడుతుందేమో అనే భయం కలిగించి వాళ్ళని తిన్నపరిచేటందుకే ప్రహసనాలు జనించినట్టు కనపడుతుంది. లోకానికి కంట్రకంగా ఉండే విషయాల్ని హేళన చెయ్యడమే ప్రహసనాల ఉద్దేశం. మొదట్లో! ఒకే వ్యక్తిని ఏకాలసి రచించినవిగాని, చర్మమూ మాంసమూ దాటి శల్యం దాకా వెళ్ళే దెబ్బలతో నిండినవిగాని లక్ష్మీనరసింహంగారి ప్రహసనాలలో కనిపించవ్. ఉద్గ్రంథాలు రచించే మధ్యకాలంలో అవసరనైవేద్యంగా లక్ష్మీనరసింహంగారు ప్రహసనరచన చేశారు గనక వీటిల్లో పాత్ర సృష్టికీ, కథాచమత్కృతికీ, కల్పనా శిల్పానికీ ఆయన యత్నమే చేయలేదు. పైగా, వీటిల్లో చాలావరకు చదువుకునే నిమిత్తం రాసినవేగాని ఆడుకునే నిమిత్తంకాదు. ఎన్నో సార్లు ఆడబడిన ప్రహసనం బలవంతపు బ్రాహ్మణార్థం. ఒక్కొక్క వాంఛనీయమో వర్జనీయమో అయిన విషయాన్ని గురించి వినోదంగా చదువుకోడానికి వీలైనది, చమత్కారమంజరి.

అల్లాయుద్దీన్ నాటి పరిస్థితులూ అహల్యాబాయి కాలపు చరిత్రా అంశంగా, దుష్టశిక్షణ శిష్టరక్షణ పరమార్థంగా వీరి నవలలు ప్రారంభం అయినాయి. "పరోపకారః

పుణ్యాయ పాపాయ పరపీడనమ్, సత్యమేవజయతి, ధర్మ మేవ జయతి, జరగవలిసిన మంగళాలు జరిగింతరవాత దుష్టులు పోతారూ శిష్టులు ఎట్లాగో బతికిపోతారూ, పాపులు మొదట్లో—మొదట్లో ఏమిటి విసిగెత్తే దాకా—నెగ్గినట్టు కనిపిస్తుంది కాని ఎప్పుడో వ్యాపారం తల్లకిందులు అవు తుందీ!'' అనే భావాలు—అనాదిగా వస్తూన్నవి—మన స్సులో పెట్టుగునే ఏ కవి కానీండి రచన చేస్తాడు. భారతంతో సంబంధం గలిగిన యితివృత్తంతో సౌందర్యతిలక పుట్టింది. అందులో మొగలిరేకుమీద రాతా, అది అనుకున్న చోటికి వెళ్ళకుండా మరోచోట పడడమూ తటస్థించి గలభా జరుగుతుంది. రచనాస్వరూపంలో అచ్చ తెలుగులూ భారత ప్రయోగాలూ ఉన్నాయి. శకారుణ్ణి స్ఫురణకి తెచ్చే రణార్ణవు డందులో వస్తాడు. ఇక, కథానిక అనేమాట వింటూంటాం. ఒక రచనని కథానిక అనడానికి పొట్టి లక్షణం ఒకటే చాలదు. జీవితసంఘటనల్లో ఏదో ఏకైక సంఘటనయొక్క అద్భుతచిత్రణం చెయ్యదలిచి అందు నిమిత్తం తేబడే మాటలూ నడిపింపబడే సంభాషణలూ సృష్టింపబడే పాత్రలూ—సమస్తమూ ఆ ఏకైకసంఘటనని అవ్యాహతంగా హృద్యం చెయ్యడానికి దోహదంచేసేవి అయినప్పుడే కథానిక సార్థకం. వీరు రచించిన చిన్న నవలలు అటువంటివే. కృష్ణవేణి ప్రతాపరుద్రుడినాటి చరిత్ర. కథాంతరంగా తిక్కన ప్రభుభక్తీ కవితాశక్తీ,

ఓరుగల్లు గణపతిదేవుని పండితభక్తి, రుద్రమదేవి పాలన శక్తి, యుగంధరుని రాజభక్తి, ప్రతాపరుద్రుని ఔదార్యమూ వర్ణింపబడడమే కాకుండా, అసలుకథలో, నాటి మ్లేచ్ఛ పరిపాలనా, చోరవిజృంభణా, రామరాజనే యువకుడి దేశభక్తి, ముచ్చటింపబడి దిక్కు లేకపోయి దొంగల గూడెంలో పెరగవలిసొచ్చిన కృష్ణవేణి అనే పిల్లకి మంచి రోజులు వచ్చి అర్హుణ్ణి పెళ్ళాడే సమయానికి కన్యధార పొయ్యడం ఎవరూ అనేసంగతి వచ్చినప్పుడు చచ్చిపోయా రనుకున్న తల్లిదండ్రులు బతికి అక్కడే ఉన్నట్టు తేలి ఆశ్చర్యం వేస్తుంది. కలియుగంలోకూడా పతివ్రతలు ఉండగల రనిన్నీ వారివల్లే భూమి నిలుస్తోందనిన్నీ మణిమంజరి లో ఉంటుంది. ఒక కుక్క అతి విశ్వాసంతో తన యజమానిని మృత్యువునించి కాపాడుతూండగా ఆయజమాని సోదరుడు ఆ యజమానివల్ల ఉపకారం పొందుతూ కృతఘ్నుడై అతణ్ణి చంపచూడడమూ, అటువంటప్పుడు ఆ కుక్కని పువ్వుల్లో పెట్టి, పాలోసి పెంచడమూ దానిసరసనే ఆ కృతఘ్నుణ్ణిచావ నీయకుండా మెతుకులు పారేస్తూ బతకొట్టడు తూండడమూ న్యాయం—అని సువర్ణగుప్తుడు లోని పరమార్థం. పాపం పుణ్యం ఎరగని వాడిమీద, ఉపకారంచేసిన వాడిమీద, తెలివితేటలు గలిగి నమ్రుడై చదువుకునే వాడిమీద కూడా లేనిపోని నిందలువేసి బాధపెట్టే మహానుభావులు ఉంటూన్నా భగవంతుడు కనిపెడుతూనే ఉంటాడని చెప్పేది రామచంద్ర

విజయం. ఇందులోని దీపావళి వర్ణనేకాక, నరసింహానికి చేసిన అలంకారం యొక్క వర్ణన కూడా హృద్యం. వర కట్నపు గొడవలూ, చదువుకున్న వరుడు తనకి నచ్చని దాన్ని పెళ్ళాడడమూ, కాపరానికి వచ్చిన తరవాత ఆ పిల్లకి విషం పెట్టాలనే సంకల్పంతో పెరుగులో విషం కలిపిన మామగారు పొరపాటున తనే అది తాగేసి టిక్కెట్టు పుచ్చుకోవడమూ, గలది రాజరత్నం. శ్రోత్రియత్వ పత నాన్ని శ్రీనాథుడు శివరాత్రి మాహాత్మ్యంలోని సుకుమార చరిత్రలోనూ తెనాలి రామకృష్ణుడు పాండురంగ మాహాత్మ్యంలోని నిగమశర్మో పాఖ్యానంలోనూ చూపిస్తూ, పరివర్తన కూడా సూచించారు. లక్ష్మీనరసింహంగారు గణపతి లో ఆత్మశూన్యమైన శ్రోత్రియత్వంయొక్క పతనం వర్ణించారు. 'గణపతి' పరంగా చెప్పబడ్డ పటాటోపమూ, నిరక్షర కుక్షిత్వమూ, జీర్ణకోశపటిమా, చీట్లాటప్రజ్ఞా, నీచత్వ ప్రీతీ, శవ జలాదిక వహనమూ, యాయవార వృత్తీ, దేశాంతర గమనమూ, బాల్యవివాహ యత్నమూ, చావగొట్టినా చదువు అంటకపోయినా బోకుగా ఉండాలని ఏడుపూ, తస్కరణమూ గాడిద నెక్కడమూ లాంటి ఘన కార్యాలుచేస్తూ పైపెచ్చు వాటిని సమర్థించడానికి సబబులు పట్టావడమూ, ఏమన్నా అంటే తొమ్మిదో అష్టం పారా యణ చెయ్యడమూ, ముష్టికి తల్లినే వెళ్ళమనడమూ, తను వెడితే పుట్టగాలుస్తూ వెళ్ళడమూ, తనకి ముష్టి వెయ్యడం

ఆలస్యం అయితే తను కుర్చీలో కూచోడమూ, మేష్టరీ చేస్తూ కుర్రాళ్ళని బాదడమూ వేషధారణమూ, పాకశాసనత్వమూ ముదలైనవి చదివేటప్పుడు 'గణపతి పాత్ర' మీంద అసహ్యం వేస్తుంది. కోపం రేగుతుంది, ఓకువస్తుంది, విచారం అవుతుంది, ఒక్కొక్కచోట జాలికూడా కలుగుతుంది. కాని నవ్వురాదు. కాని, మనిషినికట్టి శ్మశానానికి ఈడ్చినా, మనిషిఉన్న బంకీ బోల్తాకొట్టినా, మెలుకువ రాకుండా మనిషి ఇంకా నిద్రలోనే ఉండడం వచ్చేచోట్ల హాస్యరచన ఉంది. మంచి లక్షణాల్లో ఏ ఒకటీగాని ఒకటిలో భాగంగాని గణపతికి లేదు. వాడికి ఏ ఉపాయమూ కుడా తట్టదు. తనకే తట్టిందని వాడు చెప్పినా, అది వాడు మరొకరి దగ్గిర విన్నదే అని మనం అనుకోవాలి. విఘ్ననాయకుడికి దణ్ణంపెట్టి 'మాకు ఏ విఘ్నమూ వద్దు' అని ఆయన్ని మనం కోరుకునేటట్టుగానే, గణపతి పాత్రకి నమస్కరించి 'నీ లక్షణాల్లో శారీరకంగాని మానసికంగాని ఆత్మికంగాని (ఆత్మ ఉంటేమాటే !) అయిన ఏ ఒక లక్షణమూ మాకు వద్దు' అని చదువరులు అనుకోవాలని లక్ష్మీనరసింహంగారి అభిప్రాయం అయి ఉంటుంది.

కాని, సజ్జనుడియొక్క తేజమూ, సాహసమూ, త్యాగమూ తెలియపరచడానికీ రాజమహేంద్రవరంమీంద తమకున్న గౌరవం తెలియపరచడానికీ లక్ష్మీనరసింహం గారు రచించినది విష్ణువర్ధనుడు ఇనుపగుండే రాతిమనస్సూ

గలిగి, విద్యవల్ల లోకం పాడౌతుందని వాదిస్తూ నిరంకుశ పరిపాలన చేసే కటకరాజు ఉంటాడు. సజ్జనుడైన విష్ణుభట్ట సోమయాజి ఉంటాడు. అతడు 'మనసులు కరగునట్లు, మేనులు పులకరించునట్లు, హృదయములు నీరగునట్లు, మహోత్సాహము జనించునట్లు' ఉపన్యసించగలడు (ఈ వర్ణన లక్ష్మీనరసింహంగారికి చెల్లుతుంది). కథలో ప్రధానాంశం విష్ణుభట్ట సోమయాజియొక్క మంచితనం. అంత మంచితనం గురించి చదివే టప్పుడు కూడా ఘోరం కళ్ళ ఎదట జరుగుతూంటే దుఃఖం వచ్చినట్టు వస్తుంది. పరీక్షిత్తుని కృష్ణుడు రక్షించినట్టు, ప్రహ్లాదుణ్ణి నారదుడు రక్షించినట్టు, చాళుక్య వంశకరీరాన్ని ఆ విష్ణుభట్టు రక్షించగా, విష్ణుభట్టు చేత వర్ధిల్లిన వంశం గనక ఆ వంశంలోని వాళ్ళందరికీ విష్ణువర్ధన బిరుదు వచ్చిందని ఉంటుంది.

కర్పూరమంజరి గురించి కొంచెం స్మరించి ముగిస్తాను. కర్పూరమంజరి మొదటిభాగం పుట్టిన పందొమ్మిది ఏళ్ళకి రెండోభాగం పుట్టింది. ఈ సందర్భంలో 'కాదంబరి' జ్ఞాపకం వస్తుంది. కాదంబరి కొంతవరకు రచించి బాణభట్టు దివంగతుడు కాగా అతని కొడుకు దాన్ని పూరించాడు. తండ్రీ కొడుకుల్లో ఎవరు ఎవర్ని మించుతారో చెప్పలేం. కాదంబరిలో రెండు పెళ్ళిళ్ళు. కర్పూరమంజరిలోనూ అవుతాయి మూడు. కాదంబరిలోనూ కర్పూరమంజరిలోనూ కూడా ఉజ్జయిని వస్తుంది. కర్పూరమంజరి కూడా బ్రహ్మాండమైన

పన్నాగంతో కూడిన మహాప్రబంధం. రాజకీయ పరంగా, పాంచాల విదర్భ మాళవ గాంధార కోసల ఘూర్జర మొదలైన దేశాలూ వాటి రాజులూ వాళ్ళ కొడుకులూ మంత్రులూ సేనానులూ గురించిన బోలెడు గ్రంథం ఉంది. మతపరంగా, బౌద్ధమతమూ అందులోని మహాత్తర లక్షణాలూ గురించి ఉంది. హేమచంద్రు డనే కాశ్మీర బౌద్ధ రాజు వర్ణింప బడ్డాడు. అతణ్ణి మిక్కిలి వర్ణించని యితర పాత్ర లేదు, లేదు. అతణ్ణి ఒక అపరావతారంగా, కనికరపు ముద్దగా, గుణముల పోగుగా, శాంతమూర్తిగా కవి చిత్రించారు. ఇంత వర్ణించీకుడా కవి తనివి తీరినట్టు కనపడరు. కాదంబరిని స్ఫురణకి తెచ్చే వర్ణనలు కర్పూరమంజరిలో చాలాచోట్ల శబ్దార్థ శ్లేషలతో ఉన్నాయి. ఆ ఆకాశమే, ఆ సూర్యచంద్ర నక్షత్రాలే, ఆ భూమే, ఆ జలమే అయినా వాటిని వర్ణించడంలో అప్పటి పాత్ర యొక్క మనస్థితి ననుసరించి, అప్పటి కథ పట్టులో మేళవించే రీతిగా ప్రకృతి వర్ణన కవులు చేస్తూంటారు. లక్ష్మీనరసింహంగారూ చేశారు. గుండెలేని తెలివీ, హృదయం లేని బుద్ధిప్రజ్ఞ—అందులోనూ భ్రష్టబ్రాహ్మణుడి రాకాసిప్రజ్ఞ—ఎంత నమ్మకంగా ఎంత అనుకున్న ప్రకారంగా పైకెంత పవిత్రంగా అమానుష కృత్యాలు చెయించగలదో రుద్రభట్టు పాత్రవల్ల తెలుస్తుంది. చాణక్య రాక్షస యుగంధరుల నిర్దాక్షిణ్యం రుద్రభట్టు నిర్దాక్షిణ్యానికి

తీసికట్టు. జనప్రియుడైన హేమచంద్రుడి మరణం మిక్కిలి విచారం కలిగిస్తుంది. ఈ నవలలోని పన్నగడ, ఇందులో చెప్పబడ్డట్టుగానే, కురుపాండవ యుద్ధాన్ని స్మరణకి తెస్తుంది. కూనీ చెయ్యడం గురించి ఒకడిచేత ప్రమాణం చెయించవలసి వచ్చిన సందర్భంలో రుద్రభట్టు ఋగ్వేదం పఠించి ప్రమాణిస్తాడు. మరొకడు మరణం గురించి భయ పడుతూండగా, 'ఏమీ ఫరవాలేదు, ఆత్మ ఎప్పుడూ ఉండేదే, అనడానికి భగవద్గీత చదువుతాడు, అమాయికు లైన సైనికుల్ని ఉపన్యాసం ద్వారా రెచ్చగొడతాడు. తనకున్న మాత్రమూ హృదయం లేని చిత్రభాను డనే రాజుకి, చంద్రగుప్తుడికి చాణక్యుడులాగ, సింహాసనం ఎక్కిస్తా నని వాగ్దానం చేస్తాడు; రాజై నప్పుడు కూతు రైనా సరే చంపెయ్యడంలో ప్రత్యవాయం లేదని అతడికి భరోసా యిస్తాడు. కర్పూరమంజరి కథలో పాపం పండి కథకి మళ్ళుదల పట్టి సత్యధర్మాలకి జయం చేకూరడం ప్రారంభించే సరికి అయిదింటనాలుగువంతుల కథ అయి పోతుంది. పందొమ్మిదేళ్ళ అనంతరం వెనకటి వృత్తి మనస్సుకి తెచ్చుగుని కల్పనలోగాని పాత్రపోషణలోగాని శైలిలోగాని భాషలోగాని హెచ్చు తగ్గులు లేకుండా వెనకటి భాగంతో అతిగిపోయేటట్టు మళ్ళీ అంత గ్రంథం లక్ష్మీనరసింహంగారు రచించడమనేది గొప్పవిషయం. ఆ కథకి పూర్తి అనేది భగవంతుడు రాసిపెట్టి ఉండడంవల్లా, ఇష్టులు అయన్ని చేసిన ఒత్తిడివల్లా, సిద్ధించింది.

ఇన్నివందల గాథలలో సౌందర్యతిలక లోని కళా నందుడూ కర్పూరమంజరి లోని మకరందుడూ ఒకే మాదిరిగా చెట్టుకింద మాయంకావడమూ, రామచంద్రవిజయం లో కోమటి వర్ణనా గణపతి లో గణపతి వర్ణనా ఏకీభవించడమూ, రామచంద్రవిజయం లో వచ్చే బడి అచ్చంగా గణపతి లో బడిలాగేఉండడమూ, రామచంద్రవిజయంలో నరసింహాన్ని బెల్లించి తీసికెళ్ళినట్టే గణపతి లో పెళ్ళి కూతుర్ని తీసికెళ్ళడమూ—స్వల్పాల కింద కట్టవచ్చు.

లక్ష్మీనరసింహంగారు 'సర్వేంద్రియాణాం నయనం ప్రధానం' అనే యథార్థానికి అపవాదం తెచ్చి పెట్టిన ద్రష్ట. అంధత్వం ఒక లోటుకాదని నమ్ముతూ నేత్రావరోధంలేని వాళ్ళకంటె ఎక్కువ కృషి కనపరచిన మహావ్యక్తి లక్ష్మీనరసింహంగారు! పాతికేళ్ళ క్రితం ఒకసారి మాత్రమే పరిచయం అయిన మనిషినైనా సరే కంఠనాదంబట్టి పోల్చేసి మీరు ఫలానావారు కాదూ అని ఆయన అడగడం ఎరుగుదుం. మామూలు ప్రసంగాలలో సంస్కృత సంప్రదాయ ప్రకారం శ్లోకాలు చదివి చెప్పడమేకాకుండా హృద్యమూ సరసమూ అయిన సంభాషణ నడిపించడం ఆయన నేర్పు. ఆయనకి జ్ఞాపకం ఉండే తేదీలూ వయినాలూ ఇంకోళ్లు ప్రయత్నించి గింజుకున్నా జ్ఞాపకం ఉంచుకోలేరు. అనుభవ సిద్ధమైన ఎంతో రచన తెలుగుదేశానికి ప్రసాదించిన

లక్ష్మీనరసింహంగారు హృదయకవి. ప్రసంగ సౌలభ్యానికి ఆయన దారి చూపించారు. చమత్కార సంభాషణ ఆయన పెంపొందించారు. కల్పనా చాతుర్యానికీ రచనా సామర్థ్యానికీ నిదర్శనం ఇచ్చారు. ఆయన యాభై ఏళ్ళలో సృష్టించిన అంత రచన గురించి యాభై నిమిషాల్లో నేను ఇట్టెట్టే అనడం వారి గ్రంథాల్ని నేను స్మరించి మీ జ్ఞప్తికి కూడా తేవడానికే! ఏం లేదో చూడ్డంకంటె, ఏముందో చూడ్డం ధర్మంగదా!

---

# గిడుగు రామమూర్తి పంతులు

నిశితమైన బుద్ధితో, వెన్నవంటి హృదయంతో, అపరిమితమైన దేశభాషల విజ్ఞానంతో, పరదేశభాషల విశేష పరిచయంతో, వింత భాషల్ని భేదించి సాధించగల ప్రజ్ఞతో, నిద్రాహారాలు తెలియని నిరంతర కృషితో, స్వఫలాపేక్షా రహితత్వంతో, స్వధన నష్టంతో, స్వగృహ విసర్జనంతో, ఆంధ్ర దేశాద్యంత చరమ పర్యటనంతో, కోట్లాదిగా ఉన్న ఆంధ్రప్రజల మూగతనం పోవాలనే నిశ్చితత్వంతో, ఆంధ్ర ప్రజల జీవితానికి యథార్థ ప్రతినిధులైన ఆంధ్రశబ్దాల స్వరూపవైఖరీ నిర్ణయవ్యాపార పరిష్కరణ విషయంలో రామమూర్తి పంతులుగారు తెలుగుమాట రీతిని పరిశోధన చేస్తూ, అది పరిపూర్తి కాకుండానే మరణించారు. అంత కృషి ఆయన చేసి వార్ధకంలో గతించినా, ఆయన పట్టిన పనియొక్క స్వభావమున్నూ, అది తలపెట్టవలసిన మనిషి యొక్క లక్షణాలున్నూ తల్చుగుంటే, ఇప్పుడు లేకపోవడం అటుంచి, మరి యెన్ని శతాబ్దాలకో గదా అటువంటి వ్యక్తి ఆంధ్రలో పుట్టడం! అని మనస్సుకి అనిపించడంవల్ల, 'అయ్యో! రామమూర్తిపంతులుగారు పోయారా! ఇక నెల్లాగ' అని అనుకోవలసివస్తుంది.

సాధారణంగా ఎక్కడేనా మనుష్యుల్తో స్నేహం అంటూ ఉంటే, రామమూర్తి పంతులుగారికి మాటల్తో స్నేహం!

అందులో తెలుగుమాటల్లో! చాలా తెలుగుమాటల పుట్టు పూర్వోత్తరాలు తెలిసినవారు ఆయనే! మాటలే ఆయన ప్రపంచం. కావ్యసృష్టి ఆయనది కాదు. ఆమాట ఆయనే అనేవారు—'నేను రాయలేనుగా మరీ!—ఇప్పుడు అప్పా రావు మరిలేడుగా! వాడు రాస్తుండేవాడూ! వాడింకా ఎన్ని రాసిచ్చేవాడో!' అని, ఆయన, తన అత్యంత మిత్రు లైన గురజాడ అప్పారావుగారిని మనసారా స్మరించి ఆ మహామహుడి సృష్టిప్రజ్ఞ తాను జనంయెదుట శిరస్సుమీద ధరించి, మాట్టాడేటప్పుడు ఆయన అంతఃకరణ ఎంత పొంగి పోతూ ఉండేదో కదా!

అన్నా! శల్యాలవంటి పొడి తెలుగుమాటలు పట్టుగుని, వాట్ల చరిత్రలగురించి స్వంతానికి ఎటువంటి వ్యయప్రయా సలు మీదపడ్డా లెక్కచెయ్యక ఈయన ఇంత పట్టుదలతో కృషి చెయ్యడం అనేది, భగవంతుడు తెలుగు వాళ్ళకోసం ఏర్పాటుచేసిన కల్పనగావును, అనిపించేది. 'నాకు కనిపించిన ప్రతి కాగితమూ, ప్రతీ టాటాకూ, ప్రతి పలకా నేను చదువుతాను, దేన్లో ఏ పదంయొక్క ఏ రూపం అకృతక మైంది ఉంటుందో!' అని ఆయన చెప్పేవారు. ఏ దేనా రచన చూడగానే, ఆయన మొదట తణిఖీ చేసేది తెలుగు మాట రీతీ, దాని పరివర్తనమూనూ! తరవాతా అంతే! చివరకీ అంతే! కేవల పదస్వరూపంలో ఆయన ఎంత లీనం అయిపోయినట్టూ అంటే, ప్రయత్నంమీదగాని ఆయన

దృష్టి భావంమీదనే పెట్టేదికాదు. సవర భాషకి లిపీ, వాచకాలూ, నిఘంటువూ, సృష్టి చేసేనిమిత్తం మన్య ప్రదేశాల్లోకి వెళ్ళివస్తూ ఉండడం చేత ఆయనకి తత్ఫలితంగా సంక్రమించిన మలేరియా వదుల్చుకునే నిమిత్తం ఆయన మింగవలసి వచ్చిన క్వైనాయే ఆయన చెముడుకి కారణం. శబ్దం గురించి జీవితం అంతగా ధారపోసిన ఆ వ్యక్తికి శబ్దమే అబ్బరమైపోయి, 'మీ సంభాషణ విన్లేనుకదా! ఆ వూరెళితే అక్కడివాళ్ళు తను హృదయంలాంటి తెలుగు అనే టప్పుడు, దాన్ని నా చెవితో స్వీకరించ లేనుగదా!' అని ఆయన దుఃఖించవలసిన అవసరం వచ్చినప్పుడల్లా, వింటున్నవాళ్ళకి చాల బాధగా ఉండేది. ఒక ఆంధ్రుడు లోకహితమైన ఒక వృత్తాంతం తన ప్రజలకి హృద్యంగా వెల్లడి చెయ్యదల్చుకున్నప్పుడు తన తల్లిదండ్రులవంటి పెద్దలు వారి జీవిత సందర్భాలలో మనసారా అప్రయత్నంగా చేసిఉన్న మాటల ధోరణిలోనే ఆ వృత్తాంతాన్ని తనుగూడా అనేసి, అనేసినట్టే రాసెయ్యడానికి భయపడకూడదు సరికదా గర్వించాలి, అని ఆయన స్పష్టంగా, సహేతుకంగా, సోదాహరణంగా. కళ్ళకి కట్టినట్టు కనపడుతూండే తన నిశ్చితాభిప్రాయం తీవ్రంగా, సహజమైన పట్టుదలతో, తన యావచ్ఛక్తితో, తన యావత్కంఠంతో, తన హృదయం యావత్తూ తన మాటల్లో దట్టించి ఉరుములవంటి మాటల్లో మాట్లాడుతూ

రావడంలోని హైరానవల్ల కూడా ఆయనకి చెముడు హెచ్చిందని అనుకోవచ్చు.

కాని, ఆయన ప్రతి తెలుగువాడూ తన పెద్దల సమక్షంలో అనగలిగిన మాట ధోరణి అక్షరరూపంలో పెట్టడం ఎక్కువ హృదయద్యోతకం గనక ఎక్కువ హృదయంగమం అని చెప్పడంలో తెలుగు భాషకి ద్రోహం చేసి దాన్ని చెడగొట్టేస్తాడేమో అనే భ్రమలో కొందరు ఆయన చెప్పేది వినిపించుకోకుండా ఆయనకి చెముడే లేదనిపిస్తూండేవారు. జంతువులకి మల్లే అట్టే పెట్టెయ్యక, భగవంతుడు తెలుగువాడికి వాక్స్వాతంత్ర్యం ఇచ్చి, 'నీ హృదయస్థితి తెలుగులో మాట్లాడుకోగలవురా అబ్బాయి, ఆ శక్తి నీ కిచ్చా' అని తెలుగువాడితో అన్నాడు. 'నీ హృదయస్థితి నువ్వు మాట్లాడ గలిగితే, భాష గురించి సిగ్గుపడకూ! ఎవడి హృదయస్థితికి తగ్గ భాష వాడికి అమిరే ఉంటుందీ! మాట్లాడేసెయ్! దాన్ని ప్రకటించేటప్పుడు దానికి డాబుగా వేషం వేస్తే చూపులకి శాశ్వతంగా మా బాగా ఉంటుందని నువ్వు అనుకుంటూన్నకోద్దీ అది అన్నృతమై హృదయహారం కూడా కాగల్దూ! మానవుడవై పొందిన హృదయానందానుభవాన్ని లిఖితం చేసేటప్పుడు మానవాతీతుణ్ణనుకోకూ! ఆపళంగానే అనెయ్! దాల్లో విశేషం ఉంటే, దేశంలో హృదయం గల మన్ను

ష్యులు దాన్ని నిలుపుకుంటారూ!' అని తెలుగువాడితో రామమూర్తి పంతులుగారు అన్నారు.

నాబోటి అల్పపండితుడు ప్రతి దానికీ మెంతిగింజలాగ ఎగిరి ఎదటివాళ్ళకంట్లో పడగలడు. కాని, ఆయన ఆంధ్ర మహాపండితుడై కూడా, బుద్ధిసామర్థ్యానికి తుల్యమైన హృదయసౌకుమార్యం కలిగిఉండడంచేత, పండితుల్నీ పామరుల్నీకూడా నెత్తిమీద పెట్టుకున్నారు. ప్రపంచం అంటే, అశ్వత్థమే, చలనమే, మార్పే, అని వేదాంతం మాట్లాడుతూ, 'ఆంధ్ర వ్యాకరణ సూత్రాలు మాత్రం—అందులో వెయ్యేళ్ళనాటి సరుకుకూడా—స్థిరోభవాలాగ నిల్చేబాపతూ! ఆ సూత్రాలకి భిన్నంగా ఉండే తెలుగులో నిమిషానికి యాభై తొమ్మిది సెకన్లు చెడామడా ఆలోచనంతా కానిచ్చుగున్నా సరే, జాగ్రత్ స్వప్నాలల్లో మాత్రం పరా పశ్యంతి మధ్యమా వైఖరీలల్లో మాత్రం అవసర ప్రకారం మాట్లాడినాసరే, పోనీ జీవితం అంతా గడిపినాసరే తప్పులేదుగాని, వెనకటి సూత్రాలు ఎరగని రచన కాగితం మీద పెట్టడంమట్టుకు పాతకం! అది ఇతర గ్రామంలో తెలియదు. భావికాలంలో తెలియదు. కృతకరచనకి కాల గ్రామ వ్యక్తి వివక్షతలు లేవుగనక, అదే వాంఛనీయం' అనే రీతిలో మొదలెట్టి సవ్యాకరణ రచనని మెచ్చేవాళ్ళు మరో గ్రామంలోనూ రాబోయే కాలంలోనూ ఉంటారని సబబు చెప్పుకోడానికి వీలు చూసుకుని లోకంలో ఉంటూన్న

వాడుక చూడకుండానే మళ్ళీ లోకానోదాం కావాలి గనక
లోకాన్ని ఆకర్షించడం బదులు గభరాయింపచేసే రచనలు
చేసి, తను అధికమన్నా వర్తమానలోకం నీచమన్నా
గనకనే తన రచన చేసు పట్టివ్వకపోవచ్చు గాని ముందు
ముందువాళ్ళు—అంగా పాత పరతుల ప్రకారం బందో
బస్తు చెయ్యడం వల్ల వెనకే మురిగిపోయిన రచన తెగ
చదువుకోవాలంటూ యేక మురిసిపోవడం తప్ప రెండోపని
ముందువాళ్ళకి లేనట్టు!—చూడకపోతారా అనే గొంతెమ్మ
కోరికలతో యేక ఇదయే వారితో ఆయన పిడుగులా
వాదించి, మహాకవిరచనల్లో ఉత్కృష్టమైనచోట్ల దాఖ
లాలు చూపించి, 'వాటిని తప్పులనకండి, అవి తప్పులు
కావు, కవుల నోటంట తప్పురాదు, కవి సార్థకుడైతే, అవ
సరం చొప్పున వ్యాకరణం తరవాత బదుద్ధేరి అతణ్ణి సమ
ర్థించుకుంటుంది. ఏదో చచ్చి చెడుతుందీ! ప్రత్యక్షం
కూడా ప్రమాణమేనూ! చూడండి' అని నొక్కి నొక్కి అనే
వారు.

దేశోపకారమైన ఒక విషయం తరఫున ధైర్యంగా
మొర పెట్టుకోగలిగింది తను ఒక్కడున్నా, ఉదాహరణ
చూపించ గలిగింది తన ఆప్తుడు గురజాడ అప్పారావుగారు
ఒక్కడున్నా అయి కావ్యసృష్టిప్రజ్ఞగల అప్పారావుగారు
ముందే గతించినా, తనే మిగిలి, శ్రమపడి జనాన్ని క్రమేణా
తన పక్షానికి లాక్కుని, తన జీవితం సమాప్తం కాకుం

జానే తన మాటయొక్క ఫలితం అప్పారావుగారి ఉదాహరణతో ఆగిపోక త్వర త్వరగా విస్తారంగా పాకిపోవడం కళ్ళారాచూసి ఆనందించి, "సరి, నాకు ఏం కావాలీ! ఏ అవసరం చొప్పునో ఇంతమందీ నే చెప్పిన రీతి ఆచరణలో పెడుతున్నారుగా!" అని అనగలిగి మరీ తనువు చాలించారు. అయినా తనమాట దేశానికి మరీ తొందరగా వెల్లడి చేయడానికి దాన్ని పూర్తిగా అమోదించినట్టిన్నీ తనకిమల్లే కాకుండా కావ్యసృష్టి విరివిగా చెయ్యగలిగినట్టిన్నీ వీరేశలింగం పంతులుగారు ఇంకా నాలుగు కాలాల పాటు జీవించి ఉండలేదే అని రామమూర్తి పంతులుగారు పరితపించేవారు.

"మీరు ఈ మాటని ఇల్లా అంటారా! మీరు ఈ ప్రాంతాన్ని 'మొణుకువ' అంటారా! 'దాకోడం' అనే రూపం ఉపయోగిస్తారా! మీరు! నే నెప్పుడూ అల్లా అనను సుమండీ!" అని ఆశ్చర్యపడి, ఆగిపోయి, ముక్కుమీద వేలేసుగుని, ఒక్కొక్క మాటయొక్క ఒక్కొక్క కొత్త రూపం తెలుగునాట ఎవరి నోట్లోనో జీవిస్తూ ఉపయోగపడుతూ ఉంది కదా అనో, శబ్దపరివర్తనం తానుఎంచిన రీతిగా జరిగి, ఒకానొక పదం బహుశా మారి ఫలానా మోస్తరుగా అయిఉండి ఉండవచ్చును, అని తను ఇంకా సంశయస్థితిలోనే ఉండిపోగా అది అక్షరాలా ఆ రీతిగానే మారి అప్పటికే ఉంటూన్న సంగతియొక్క యాథార్థ్యం అప్పుల ముఖతా

తెలిసిందిగదా అనో, తనికి దొరికింది ఒక మాట కాదు, పెద్ద మూటేఅన్నట్టు బ్రహ్మానందపడి, ఆ ఆనందం ముఖమంతా వ్యాపించగా, 'ఔర! నే నింత వరకు ఇది విన్లేను సుమండీ! ఏదేనా మాట ఏ స్థలంలో జనించిందో ఆ స్థలంలోగాని మార్పు చెందదు. విన్నారా!' అంటూ, తను అంత సార్థకానుభవంతో పోగుచేసుకున్న అంత అపార పాండిత్యం కలిగి ఉండీకూడా రామమూర్తి పంతులుగారు అనేటప్పటి వినయం చూసిఉన్న వాడికి, పాండిత్యంగురించి గనక యెవళ్ళైనా విఱ్ఱవీగడం మొదలెడితే వాళ్ళని గురించి ఏమనుకోవాలో బోధపడేది.

ఆయన దగ్గిర చదివినవాళ్ళు ఆయన చెప్పిన ప్రతీ మాటా సరేసరి హెచ్చుతగ్గు వచ్చినప్పుడు పడ్డ ప్రతీ దెబ్బా కూడా జ్ఞాపకం ఉందని చెబుతారు. ఆయన తన మేష్టరీ పదవి చాలించిన తరవాత మాత్రమే ఆయన పరిచయ భాగ్యం పొందగలిగిన అస్మదాదులతో కలిసి ఆయన నడుస్తూండేటప్పుడు పెద్దతనంచేత ఆసరా కావలిసి ఆయన యెవరిమీదేనా చెయ్యి ఆనుకొని 'మీకు చాలా శ్రమ ఇస్తున్నాను' అంటూ నొచ్చుకున్నా, ఆయన న్యాయతః యిచ్చింది శ్రమ కాదు, 'శరణ్యం' 'అభయహస్తం' అని తోచేది కలుసుకోగానే, 'ఇదిగో! రండి! కూర్చోండి! ఈమధ్య కలవలేదు. ఈ మాటకి కొన్ని కొత్త ప్రయోగాలు తీశాను. ఈ పదం యతిస్థానంతోనే దొరికింది సుమండీ!

తిక్కన్నే వాడేశాడు. ఈ పుస్తకంలో పాత సూత్రాల్ని బట్టి మూడువేల తప్పు లున్నాయి!' అని ప్రారంభించి, తన కృషి వినేవాళ్ళు చిక్కినప్పుడు వాళ్ళతో వాళ్ళ మోతాదునిబట్టి గంటలగాయతు నాలు గైదు గంటల సేపైనా ప్రసంగించి, ఆ ప్రసంగంలో వందలాది శబ్ద సాదృశ్యాలూ శబ్ద వైచిత్ర్యాలూ బోధిస్తూ, 'ఇవి మీరు కూడా జ్ఞాపకం ఉంచుకోండి! నేను మరి జ్ఞాపకం ఉంచుకో లేకుండా ఉన్నాను' అంటూ నిజానికి చివరివరకూ ఒక్క చిన్నముక్క కూడా మరవకుండా జ్ఞాపకం పెట్టుకోగలిగిన రామమూర్తి పంతులుగారు మాట్లాడే సంగతి జ్ఞాపకం వచ్చినప్పుడు, ఆయన తన ధనం, తన గృహం, తన జీవితం, తన జీవం, తన సర్వస్వం ఎల్లా ధారపోశారో బోధ పడి, హృదయం వణికిపోయేది.

మార్పు ప్రతిదాన్లోనూ ప్రతి జనుడికీ కనుపిస్తూనే ఉంటుంది. కాని అదిగో మార్పు, మనం మారుతున్నాం, సంగతి ఇది' అని ఆ మారేజనంతో చెప్పడానికి సాహసించే వాడు తాత్కాలికంగా ఇంతో అంతో రొష్టుపడాలి. దేశం—అనగా జనం—ఆయన్ని తగినంతగా గణించుకో గలిగిందో లేదో దేశానికే తెలుసు. కాలం ఆయన్ని గణించి తీరుతుంది. భూమిమీద తెలుగు మాట్లాడే వ్యక్తి ఒక్ఖడుమాత్రం మిగిలిఉండే కాలం వచ్చినా, ఆ ఒక్ఖడూ

తన హృదయ పరిస్థితులు యథారీతిగా వెలిపుచ్చడంలో తన తల్లిదండ్రులవల్లా పెద్దలవల్లా తను నేర్చుకోగలిగిన మాటధోరణిలో (వ్యాప్తి శాశ్వతత్వాలకి లోటు వస్తుందనే భయంచేత మార్చి దాన్ని కేవలం అనృతంగా చేసేసి, బుర్రతో హృదయాన్ని పొడిచి తన భయాన్ని ఖాయపరుచుకోకుండా) తను మాట్లాడేసెయ్యడం, అవసరం అయితే అదే లిఖితం చెయ్యడం, తనకి నామర్దా కాదు సరికదా అసలు అదేగదా సూనృతం, అదేగదా యథార్థ జీవితానికి సూచకం, అదేగదా తెలుగు జిహ్వకి జన్మ సాఫల్యం, అని చెప్పిన మహానుభావుడు రామమూర్తి పంతులుగారే కదా అనే మాట మరచిపోడు.

# గురజాడ అప్పారావు

ఆర్య మహాశయులారా!

నవ్యసాహిత్య పరిషత్కార్య దర్శిగారు నాయందు తమకు గల దయచే, శ్రీ గురజాడ అప్పారావుగారి చిత్ర పటావిష్కరణం ఈ సందర్భంలో జరపడానికి నన్ను కోరి ఉన్నందుకు వారికి అనేక వందనాలు. ఇట్టి కృతి నిర్వహించ డానికి నాకున్న అనర్హత ఇతరులకంటె ఎక్కువగా నాకే తెలుసునని వినయపూర్వకంగా మనవి చేస్తున్నాను. నేను గురజాడ అప్పారావుగారి ఆంతర్యం ఎరిగిగాని, వారి పరి చయం కలిగిగాని, వారిబోధ ముఖతా వినిగాని, వారి దర్శన ఫలం పొందిగాని, చివరికి వారితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపిగాని ఉండలేదు. అయినా, అటువంటి పండితుడునూ రచనాబ్రహ్మనూ అటువంటి ప్రశాంతుడునూ సుహృదు డునూ అయిన మహానుభావుణ్ణి గురించి ఆర్యుల సమక్షంలో ముచ్చటించడానికిన్నీ, ఒక వేళ నాకు మాటలు నిండుకుంటే ఆగిపోయి, సజీవ చిత్రపటంలో ఆయన ఇదుగో అని చూపించ డానికిన్నీ, తరుణం కలగడం అనేది జన్మసాఫల్యమే కాదు బహుశా జీవితపరమావధిగదా అని—లుబ్ధావధాన్ల మనస్సుకి ఇంటికొచ్చిన పెళ్ళి సంబంధం తోచగలిగి ఉండినట్టు—నా అల్పత్వానికీ పామరత్వానికీ తోచడంవల్ల, ఈ ఆహ్వానాన్ని

వదులుకోలేక, స్వీకరించాను. ఇప్పుడు సభవార్ని ప్రార్థించే దేమంటే, నా మమకారాన్ని ఒప్పరికించి, నా సాహసాన్ని మన్నించి, నా హృదయాన్ని గుర్తించండి, అని. నన్ను ఈ మహాసందర్భంలో ఎల్లానూ ఇక్కడికి తెచ్చారు కనక, నాకూ గురజాడ అప్పారావుగారికీ గల బాంధవ్యంసంగతి ముందు కానిచ్చేసి, వారి రచనల్లో నన్ను ఆకర్షించినది ఆ వ్యక్తి లిఖించిన యావత్తున్నూ అయినప్పటికీ వ్యవధిని బట్టి వారి రచనల గురించి లఘువుగా మాత్రమే చెప్పి, తరవాత ఆ ఆంధ్రవ్యక్తిలో ప్రత్యేకంగా ఆవిర్భవించిన మహాత్యం అని నే ననుకున్నది స్మరించి, వారి చిత్రపటం ఆవిష్కరిస్తాను.

గొప్పవాళ్ళతో సంబంధం కలుపుగోడం అల్పుడికి అవసరం కనక ఎల్లానో తంటాలుపడి అతను బాదరాయణిస్తాడు. నేనూ అంతే చేస్తాను. 'కన్యాశుల్కం' పుట్టిన సంవత్సరమే నేనూ జనించాను. ఇటీవల అంతా అంకెల మీదా బ్రాకెట్లమీదా నడుస్తోంది కనక అంకసంబంధం గణనీయం. (ఈ వాక్యం నేను సభలో అన్నప్పుడు అధ్యక్ష పీఠంలో ఉన్న శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు తను పుట్టిన సంవత్సరమూ అదే అని చెబుతూ మాలో మాకు మరో చుట్టరికం సూచించారు!) 1915 లో గురజాడ అప్పారావుగారి నిర్యాణం. 1917–18 లో నేను రాజమండ్రీ కాలేజీ విద్యార్థిగా ఉండగానే నన్ను ఎల్లానో గుర్తించి,

శ్రీ సత్యవోలు గున్నేశ్వరరావుగారు—రాజమండ్రి కేసరి, రాజమండ్రికి కిరీటంలేని రాజు, అనే బిరుదులు జనంవల్ల పొంది, జనప్రియుడై, దీనజన రక్షకుడై వెలిగిన వ్యక్తి—నాతో శ్రీ గురజాడ అప్పారావుగారిని గురించి ప్రసంగాలు చేస్తూ ఊరుకోక, వారి ప్రతిభ ప్రశంసిస్తూ, తన అభ్యాసం చొప్పున ఆంగ్లభాషలో ''అప్పారావు ఒక తేజస్సు, ఒక తెలుగు వెలుగు. అప్పారావు గ్రంథాలు సువర్ణాక్షరాలతో అచ్చు వెయ్యాలెను.'' అంటూ గంభీరంగా అని, నాకు పరోక్షవ్యక్తిని గురించిన ఆవేశం కలిగించుతూ, అంతటితో ఆగక, 'మీరుకూడా అట్లాంటివి వ్రాయాలి' అనేవారు. నేనుకూడా ఆయన అన్నదానికి జవాబుగా, ఇంగ్లీషు భాషలోనే 'మనకి తెలుగు పడదండి, మన సబ్జెక్టు వేరు' అనేవాణ్ణి! మరికొంచెం తరవాత, ఆయన ఒకనాడు నన్ను తన యింటికి తీసికెళ్ళి 'కొండుభొట్టీయం' చిత్తుప్రతి (బహుశా అది శ్రీ గురజాడ అప్పారావుగారి, స్వహస్తలిఖితం అయి ఉండవచ్చును!) నాకు ఇచ్చి, 'ఇది మూడంకాలే ఉంది. మీరు పూర్తి చెయ్యాలి' అని, నాయందుండే మక్కువ చేత అన్నారు. నాకు భయం వేసి, 'అవును లెండి. నన్ను ముందు తెలుగు గుణింతాలూ వగైరా నేర్చుకోనివ్వండి' అని నేనన్నాను. తరవాత చాలాసార్లు ఆయన అల్లానే అంటూండడం, నేనూ అల్లానేలెండి అంటూండడం జరిగింది. 1919, 1920 సంవత్సరాలలో కన్యాశుల్క—

పుస్తకం ప్రతీ వీలైనప్పుడూ, పుస్తకం విప్పగానే ఏ పేజీ
వస్తే ఆపేజీ ప్రారంభించి చివరవరకూ నాతో కలిసిచదివి,
తమరు ఆనందించిన పట్లు సహేతుకంగా నాకు చూపించి,
అవికాక నేను సూచించుతూండేవి తమరు ఆమోదిస్తూ
సహాస్వాదన చేసిన మిత్రులు (శ్రీ) అయ్యగారి రామచంద్ర
రావుగారినీ, (శ్రీ) సూరంపూడి హనుమాన్లుగారినీ తలుస్తాను.
మరి ఒక పేరు—కీ. శే. (శ్రీ) సముద్రాల అప్పలాచార్యులు
గారు! వీరు విజయనగరంలో ఉంటూండినప్పుడు గురజాడ
అప్పారావుగారు తన స్నేహితులనిన్నీ, అటువంటి స్నేహం
తనకి రాజమండ్రీలో నాతో ఉండవలెననిన్నీ, చెబుతూ తనే
నన్ను విని వచ్చి నాకు స్నేహితులై, నన్ను ఎక్కువగా
మన్నిస్తూ, నేనాడినమాట—ఎంత సాయిలా పాయిలా
మాట అయినా సరే—ప్రతీదీ తను సమర్థించి, తన్నిమిత్తం
తర్కప్రకరణాలు కూడా ప్రమాణిస్తూ, వీలైన ప్రతిసంద
ర్భంలోనూ గురజాడ అప్పారావుగారి ప్రతిభను వెల్లడించే
సంగతులు నాకు వినిపిస్తూండేవారు. గురజాడ అప్పారావు
గారితో నాకు బాంధవ్యం కలిగించిన వీరు, అంతా నాకు
వంద్యులు.

గురజాడ అప్పారావుగారు చాలాగ్రంథాలు రాశారు.
ప్రతీరచనలోనూ కథా కమామీషూ, బోలెడు గ్రంథం
ఉంటుంది. ప్రస్తుత సందర్భంలో నేను కథలు మానేసి కమా
మీషులు మాత్రం లఘువుగా సూచించి, పిమ్మట ఆవ్యక్తిని

స్మరిస్తాను. చాలామందికి తెలిసిన రచన 'కన్యాశుల్కం'. 'కన్యాశుల్కం' ప్రకృతి సాదృశ్యమూ, కదలికా, వ్యక్తిత్వమూ, పోనుపోను గాంభీర్యమూ గల ఒక ఆట. అది ఒక తాత్కాలిక దురాచార హేళన నెపంగా రచింపబడినా కథాచమత్కృతీ, భావసారస్యమూ, పాత్ర చైతన్యమూ అందులో కలకల లాడుతూండడంవల్ల జనహృదయాలకి ఎక్కి నిల్చిన అపూర్వ ఆంధ్రపదశిల్పం. దానిలో పడ్డ ఒకటి రెండు పుంజీల స్థానికపదాలవల్ల అది ఆంధ్ర లోకాన్ని ఆకర్షించకపోడం జరగలేదు, సరిగదా, అట్లాంటివి ఉన్నా అది ఆంధ్రులకి హృద్యమై చరితార్థం అయింది. హాస్య రసోత్పత్తికి సూత్రకారులు సూచించినలక్షణాల కన్నింటికీ లక్ష్యాలు అందులో ఉన్నాయి. దాని సారస్యం భాషలోనూ, భావంలోనూ, పాత్రలలోనూ, సంఘట్టనలలోనూ కూడా చిమ్మి ఉంది. అందులోని పాత్రలయొక్క గుణసమ్మేళనం, ఎవరినో చూసి ఒక్కొక్కపాత్ర చిత్రించారా అన్నంత స్వభావసిద్ధంగా అతుక్కుని, అటువంటివాళ్ళు మనకి నిత్యకృత్యంలో కనపడచ్చుననే విశ్వాసం కలిగిస్తుంది. ఏకత్వం సిద్ధించిన ఒక కృతిని కర్త అయినాసరే తీసుగుని పునరాలోచనతో వ్యవకలన సంకలనాలూ, సూక్ష్మీకరణ విపులీకరణాలూ చేసినప్పుడు ఏర్పడే ఫలితరచనకి మళ్ళీ మరో కొత్త ఏకత్వం చేకూరడం కేవల దైవాధీనం—సాధారణంగా కథ అడ్డం తిరుగుతుంది. 'కన్యాశుల్కం' రెండవ కూర్పులో ఈ అడ్డం

తిరగడం జరిగిందని నేను అనుకుంటాను. అందుకని, రెండవ కూర్పులోని ప్రతి ఒక దృశ్యమూ మిక్కిలి నటనానుకూలం అయినా, ఒకే గుక్కలో అంతా ఆడెయ్యడానికి కాలం హెచ్చుకావలిసి రావడంవల్ల, ప్రదర్శించేవారు తమక వీలైన వేళకి ఆట ప్రారంభించి, ఇష్టం వచ్చిన దృశ్యంతో ఆట చాలించడం ఎరుగుదుం. ఏమైనా, 'డామిట్, కథ అడ్డంగా తిరిగింది!' అనే రెండవ ముద్రణపు ముగింపు వాక్యం సాభిప్రాయం! కథ అడ్డంగా తిరగక నిదానంగా పోతే ఎట్లాఉండేదో ఆ ప్రతిభాశాలి ముఖతా మనం వినలేదు, మరి వినలేంగదా! గ్రంథాభిమానం గలవాళ్ళకి ఈ సందర్భం ఎంత ఆలోచనకైనా విపశరరంగం. నా అల్పబుద్ధికే ఆ వాక్యంయొక్క అర్థం అనేక విధాలగా తోస్తూంటుంది. ఒకప్పుడుఏమనిపిస్తుందంటే: ఆరంగంలోవచ్చే గిరీశం, సౌజన్యారావు, మధురవాణి—ఈ ముగ్గురికీ కూడా శీలపరివర్తనం అద్భుతంగా కలిగింది గదా, ఆ పరివర్తనలు సమన్వయించి కథ సాగించి పూరించాలంటే మరో కథలోకిపోయి ఎంతదూరంవెళ్ళాలో గనక అసలు కథ ఆగిపోవడంలో అడ్డం తిరిగింది—అని. మరొకప్పుడు, గిరీశం, రామప్పంతులు, మీనాక్షి, కరటకశాస్త్రుల్లు—వీళ్ళు చేసిన పన్లకి వీళ్ళని సంఘం ఏమీ శిక్ష చెయ్యలేదే, ఆ శిక్షలు ముందు కథలో చెప్ప దల్చాడు గావును కవి, అనిపిస్తుంది. గిరీశానికి బుచ్చమ్మనీ, రామప్పంతులకి మీనాక్షినీ, మహేశానికి సుబ్బినీ ఇచ్చి శాస్త్రి

క్తంగా పెళ్ళిళ్ళు చేసేస్తే, ఒక విధమైన అంతం కథకి వచ్చేదికదా, కవి హృదయం అదేమో, రచించి ఉన్న కథలో అవి జరుగలేదు గనక, కథ అడ్డంగా తిరిగింద న్నాడు కవి, అని తోస్తుంది. ఇల్లాగా, 'కన్యాశుల్కం' లోని ఒక్కొక్క వాక్యానికే, వ్యాఖ్యానం కాదు. గ్రంథమే లేవదియ్యడానికి వీలు కనిపిస్తుంది. అదీగాక, రెండవ కూర్పులో 'కన్యాశుల్కం, కన్యాశుల్కానంతరం' అనే రెండు వేర్వేరు విషయాలకి సంబంధించిన రెండు వేర్వేరు గాథలు జోడింపబడ్డట్టున్నా, అందులో 'కన్యాశుల్కానంతరం' అనే భాగానికి చెందిన కథలో రావలసిన ఒక పాత్ర అయిన గిరీశం (—అనే 'గిరడు') అమాంతంగా కడం పాత్రలకన్నింటికీ నామం పెట్టి ప్రదర్శనం మొత్తానికి తనే అక్రమంగా మొనగాడు అయినట్టున్నా, గోచరిస్తుంది. పైగా, 'కన్యాశుల్కం' కూడా 'మృచ్ఛకటిక' లాంటి సాంఘిక ప్రదర్శనమే గనక మధురవాణి వసంతసేనని మన జ్ఞప్తికి తెస్తుంది, గిరీశం శకారుణ్ణి జ్ఞప్తికి తెస్తాడు. మధురవాణి వసంతసేనకి మల్లే హృదయంకలది అవడమే కాక, మాట మాధుర్యం కలదై ఇతరుల్ని (సౌజన్యారావు వంటివార్ని కూడా!) దిద్ది సన్మార్గాన్ని పడేటట్టు చేస్తుంది. జ్ఞానాజ్ఞానాల కలయిక, సంప్రదాయాలలో గల, శకారుడి రాక్షస హాస్యముందు, అటువంటి కలయికయే, భావలలో కూడా కల, గిరీశం నొక్క తుంటరి హాస్యం మార్దవం

అని తోస్తుంది. ఈ రీతిగా, నేను కాదు, విశేషసారస్యం తెలిసిన వాళ్ళు విచక్షణతో చూస్తే ఒక శాశ్వత గ్రంథ పరంపరను జనింప చెయ్యగలగడానికి ఉండవలసిన ఉన్నత లక్షణాలుగల అపూర్వ రచనలలో 'కన్యాశుల్కం' ఒకటి సుమా, అని, పరిష్కరించగలరు. ఆంధ్రుడు 'కన్యాశుల్కం' చూడకపోతే ఎట్లా, 'కన్యాశుల్కం' చూడకపోతే ఆంధ్రుడెట్లా !

తరవాత 'కొండుభొట్టీయం.' 'కన్యాశుల్కం' అతి పూర్ణం అయితే, 'కొండు భొట్టీయం' అసంపూర్ణం. అయిదంకాలూగల సాపుప్రతి రైలుప్రయాణంలో పోవడం, చిత్తు ప్రతిలో మూడంకాలే ఉండడంవల్ల, ఇట్లా ఇది నిల్చి పోయింది. కథ యొక్క దృష్టి సంఘసంస్కారం. గిరీశం ఇందులో ఉంటాడు బి. య్యే పూర్తిచేసి. కవికి ఆ పాత్ర మీద మక్కువ మరి అడగాలా ? అతడు యుగంధరరావు పంతులు కొడుకని తెలుస్తుంది. 'కన్యాశుల్కం'లో అమాయిక వితంతువూ తుంటరి బ్రహ్మచారీవస్తే, ఈ రచనలో అందుకు ప్రతిగా తెలిసిన వితంతువూ తెలియని బ్రహ్మచారీ వస్తారు. సాహేబుపాత్ర హిందుస్తానీ మాట్లాడతాడు. పద్యాన్ని నవ్వు తెప్పించడానికి ఉపయోగించిన చోటుందిందులో ! మంజువాణి మధురవాణికంటె ప్రౌఢ. కొండి భొట్లుపాత్ర శర్విలకుణ్ణి స్ఫురింపచేస్తుంది. వెంకన్న పాత్ర వల్ల జాలియొక్క సరిహద్దుల్ని ముట్టుకునే హాస్యం కలుగు

తుంది. దీని రంగాలన్నింటిలోకీ మతసంస్కార చర్చలు వచ్చేరంగాలు మాత్రం దీర్ఘం. జరిగిపోయిన సంగతి యొక్క కథనంవల్ల హాస్యం కల్పించడం ఈ గ్రంథంలో ఒక విశేషం. రామ్మూర్తిపెళ్ళి, అక్కాబత్తుడి పాయం, గిరీశంపెళ్ళి, వెంకన్న పామరత్వం ఇవన్నీ బహుశ తక్కిన అంకాల్లో ఫలించి ఉండి ఉండాలి. ఇక ప్రదర్శనాల్లో ఆయన చివరికి యత్నించింది 'బిల్హణీయం.' వ్యావహారిక భాషలో ఉత్కృష్టభావాలు ప్రకటన చెయ్యవచ్చునని తార్కాణకోసం అది రాస్తూన్నట్టు ఆయనే ఒక స్నేహితుడికి రాశారు. ఇది రెండంకాలే అచ్చుపడింది (1910, 1911 ఆంధ్ర సంవత్సరాది సంచికల్లో). గ్రంథరూపంలో అది నేను చూడలేదు. కథ, బిల్హణీయ ప్రబంధంలోఉన్న పచ్చిరకం కాదు. వైయాకరణులూ, తార్కికులూ, ఉపాధ్యాయులూ, మంత్రీ, కలిసి కవియైనవాణ్ణి, రాజు, గౌరవించకుండా చెయ్యడానికి పడేపాట్లు ఇందులో కళ్ళకి కట్టినట్లున్నాయి. ఇందులో కథంతా ఆస్థానంలో జరిగిందే అనీ, ఫలానా పాత్ర ఫలానా అనీ అంటారు. కావచ్చు. లేక బిల్హణీయ ప్రబంధంలోని 'శబ్దాపశబ్ద' పద్యంవల్ల ఈ పన్నుగడ స్ఫురించి ఉండవచ్చు. ఆస్థానాలల్లోని గౌరవ ప్రియత్వాలూ, అకసుసులూ, ఈర్ష్యలూ, గోతులు తవ్వడాలూ, కాళ్ళు పట్టుగోడాలూ, లుకలుకలూ, ఇందులో తెలుస్తాయి. ఇందులోని విదూష

కుడు 'స్వీయం' కావచ్చు కాని, షేక్స్పియరులోని 'ఫ్లూలిన్'
జ్ఞాపకం వచ్చి తీరుతాడు. ఇక నారాయణభట్టుగారి బిల్హ
ణాను కరణ శ్లోకం వగైరా లట్లా ఉంచి, కొన్ని భావాలు
స్మరిస్తాను. 'మన పకవి సకక్షిణాకంగా ధారపోస్తే బిల్లడు
బిల్హణుడు' అనే వాక్యంలోని సారస్యమూ, 'అసాధారణ
ప్రతిభావంతులగు మహా పండితులచేత ఉత్పాదితమైన
వాక్పరంపర భగవదుత్పాదిత మగు సృష్టి పరంపర వలెనే
అస్మదాదులకు ఆశ్చర్యజనకమై యున్న నశక్యమై
యుండును' అనే వాక్యంలోని తూకమూ, 'వ్యాకరణ
శాస్త్రము శబ్ద బ్రహ్మపరము, మీ తర్కశాస్త్రము అర్థ
బ్రహ్మపరము. అర్థ బ్రహ్మాన్నే అందరూ ఉపాసిస్తారు. శబ్ద
బ్రహ్మంతో సంతుష్టి తక్కువ. అర్థంమాట కొస్తే మంత్రి
నానా పంతులు మహా పండితులు. మీరంతా నిరర్థకులే'
అనే పరిచ్ఛేదంలోని సార్థక హేళనా, 'సాగింది నిజం,
సాగంది దబ్బర' అనే వాక్యంలోని పొదుపైన తెలుగు
దెబ్బా, 'పండితులకి ఉద్యోగాలు చెయ్యాలని తాపత్రయం,
ఉద్యోగస్థులకు పండితు లనిపించుకోవాలని తాపత్రయ
మూను' అనే దాల్లోని రెండంచుల కత్తిచురుకూ, కవి
తలపెట్టిన సంకల్పం సిద్ధించి ఆయన భాషాశైలి ఆరితేరి
గడ్డకట్టింది అని సాక్ష్యం ఇస్తాయి.

సాధారణంగా కొత్తదారి తొక్కినవాడిమీద పడే
అపవాదు ఏమిటంటే, అతడు పాత దారిని నడవడానికి

సామర్థ్యం లేక ఏదో కొత్త ఎత్తు వేశాడు—అని. ఈ మాట ఆయన్ని ముత్యాల సరాలు రాయగానే అనుంటారు. ఆ అపవాదు తొలగించుకోడానికి లోగడ కవులు పుచ్చుకున్న పాత కందగీతాలూ ఆటవెలది చంపక మాలలూ పుచ్చుకుని, పాతకథ పుచ్చుకుని, ఆయనా 'సుభద్ర' రాశా రనుకోవాలి. కాని, ఈయన కందాలు కర్రవీ, ఆట వెలదులు పై మెరుగు రకంకాక, జీవంతో తాండవించడం వల్లనున్నూ. పైగా ఈయన కథలో నాటకమూ, భాషలో ధ్వనీ బయల్దేరడమున్నూ జరిగి ఈ రచనా ఆకర్షణీయంగానే ఉంది. 'ముత్యాల సరాల' భాష హృదయ భాష. వాటి సందేశం సరిగా వ్యాపించడానికి ఆంధ్ర వైశాల్యం చాలదు. మత్తకోకిల పాదంలో కొంతభాగం ముత్యాల సరపు పాదం. అయినా, దీని నడకలో కొత్తదనం ఉంది. ముత్యాల సరాల కవిత్వం ఆస్వాదించడానికి అనర్హుడైన తెలుగువా డుండడు. 'నీలగిరి పాటలు' అన్నీ కలిపి అరడజనే అయినా, వాటి తెలుగుదనం, వాటి హృద్య సందేశం, వాటి శబ్దార్థ లయ రాగ సమన్వయం, అద్వితీయం! 'చిత్తరువని చూడ' అనే గేయం, ఆస్వాదకుడియొక్క ప్రస్తుత జన్మకే కాక 'కలుగు జన్మములకు' కూడా ఔషధం. 'మాటా మంతీ' లోని అంశాల యొక్క ముచ్చటింపు ఆయనయొక్క ప్రసన్నతనీ, జనప్రియత్వాన్నీ, సత్యప్రియత్వాన్నీ, నిరాడంబరత్వాన్నీ, కావ్యాభిరుచినీ తెలియపరుస్తుంది. ఇక, 'అమృత నిష్యందిని

యగు కలకల నగవును, కరకంకణముల హ్రృద్యారావ మును విన నయ్యెను' అనే 'దిద్దుబాటు' యొక్క చివర వాక్యం, చిన్న కథయొక్క నిర్వచనం తెలియజేస్తుంది అనడంలో అతిశయోక్తి లేదు 'మీాపేరేమిటి' అనే వచన రచన మరోటి. ఇందులో 'శతసెంకె' అయిన 'రామ్మూర్తి' గురించి వస్తుంది. నందిగా మారి రంకెవేసి పరారీ అయి మళ్ళీవచ్చి త్రిశూలాకారం గనక పేరు శివపేరే అని దెబ్బ లాడే శరభయ్యా: కలెక్టరు వేసిన అయిదు రూపాయిల జుల్మానా సంగతి కప్పెట్టుగుని పైపెచ్చు కలెక్టరు తనకి అయిదు రూపాయిలు ప్రెజెంటిచ్చి ముష్టిచెంబు కొనిపెట్టి నట్టు చెప్పుగుంటూ పృథివ్యాపస్తేజాల సీచక్రమమున్నూ తన బరువున్నూ హేతువులుగా చెప్పుగుని గుండం తొక్కడం మానుకున్న వైష్ణవకెస్తాను మనవాళ్ళయ్యా: తూంపట్టు పులిహోరా వైష్ణవమూ ఏకకాలమందే గ్రహిం చిన రామినాయుడూ: అంతా చల్లారిం తరవాత అటక మీాంచి దిగి భార్యయొక్క సాహసానికి ఆవిడమీాద అనుష్టుప్పు చెప్పిన కృష్ణమాచార్యులూ: చదువర్ని ఆకర్షించి ఆనందింప చేస్తారు.

ఇల్లాంటివి ఆ వ్యక్తి రచనలు. మరి ఆ వ్యక్తి!

ప్రజ్ఞా, మేధా, శాస్త్రం, కళా—అన్నింటిలోనూ నిధు లైన మహారాజున్నూ సభ్యులున్నూ కూడా గల. ఆ

స్థానంలో మహాతేజంతో ప్రకాశించిన తార—గురజాడ అప్పారావు.

ఆంధ్రభాషా స్వరూపంలో వచ్చిన విప్లవానికి తాను శ్రీ గిడుగు వెంకటరామమూర్తి పంతులువంటి కారకుడు కాకపోయినా, నూతన రూపోదయానికి తానొక వేగుచుక్క—అని ముంజూపు గల ద్రష్ట—గురజాడ అప్పారావు.

తిననాటివరకూ ఉన్న పాత రచనలో యంత్రత్వం, కృతకత్వం, అశ్లీలతా, ఆడంబరత్వం మాత్రం విసర్జించి, మాహాత్మ్యం స్వీకరించి పాతకొత్తల మేలు కలయికలో ఆకర్షణ సహజరీతిని సాధించి, ముట్టినదంతా రసవంతం చేసిన సువర్ణయోగి—గురజాడ అప్పారావు.

అన్ని అంతరాలలోని ఆంధ్రజీవితాలూ సానుభూతితో పరిశీలించి, అనేకుల్ని రసాభివృద్ధి నిమిత్తం ఏకంచేసి, వాటి జీవత్వానికి ఋజువుగా చరితార్థం అయిపోయిన పేర్లుగల హాస్య పాత్రల్ని బహుళంగా సృష్టించిన ప్రథమాంధ్ర రచనాబ్రహ్మ—గురజాడ అప్పారావు.

ఆంధ్రాంగ్ల సంస్కృత మహాజన జీవిత రహస్యాలూ, సారస్వత విశేషాలూ అవగాహన చేసుగుని, తన హృదయంలో పరివర్తనలు కలగగా, వాటిని తన హృదయ తుల్యమైన భాషతో సూటిగా ఆంధ్రహృదయాలకి చలనం కలిగేలాగు, గంభీరభావంతో పిట్టైనంత నిరాడంబరంగా—ఆకులందున అణగి మణగీ కవిత కోకిల పలుకవలెనోయ్—

అని తనే అన్నరీతిగా అనగల్గిన ఆంధ్రహృదయ కవి—గురజాడ అప్పారావు.

అభయం, దివ్యప్రేమ, పవిత్రస్నేహం, త్రికరణశుద్ధి, సకల మానవ సౌభ్రాతృత్వభావం, కార్యాచరణా, దేశమానవాదరణా, సుగుణగ్రహణం, క్షమం—వంటి మహత్తర మానవలక్షణాలు పాద పాదంలోనూ మెరిసే రచనల్లో గద్య పద్య గేయ మొదలైన ముఖ్యరూపాలన్నింటినీ మూర్తీభవింపజేసిన సర్వతోముఖుడు—గురజాడ అప్పారావు.

నీకు బుద్ధిలేదా అని తనకి ఉత్తరం రాసిన ఆకాశ రామన్నకి కూడా ఎంతో మొగమాటంతోనూ మిక్కిలి మార్దవంగానూ జవాబు రాయగల్గి ప్రశాంతము గల సముచిత్తుడు—గురజాడ అప్పారావు.

ఇక మోటుతనంగాని నిర్దయగాని అసభ్యతగాని గలిగినట్టిది కాకుండా ఉండే చమత్కారమున్నూ. ఒకే పాత్రలోనూ పాత్రల సన్నివేశక్రమంవల్లా సంగతుల పౌర్వాపర్య క్రమంవల్లా, ఒకప్పుడు ఒకే సంఘటనలో, మరొకప్పుడు రెండు సంఘటనల క్రమా వైరుద్ధ్యంవల్లా, మరి యెన్నెన్నో విధాలుగా కేవల చమత్కారంకంటె గంభీరమై సమ పాళమై సార్వత్రికమై శాశ్వతమై హృదయంగమమైన స్వారస్యం ఆంధ్రంలో కల్పించి దాన్ని సభ్యపరిచి జయించడమేకాక, తాత్కాలిక విషయం రచనాపదార్థంగా తీసుకున్నా, తన రచనకి శాశ్వతత్వం నిర్ణయించుకోగలిగిన ఆంధ్రస్వారస్య సమ్రాట్—గురజాడ అప్పారావు

అస్మదామల కంఠసీమల్ని పావనం చెయ్యడానికి కేవల ముత్యాల సరములు కాదు సువర్ణాక్షరమాలలు చిత్ర విధాలుగా గుచ్చి మనసార ఇచ్చిన ఆంధ్రహృదయ సులభుడు—గురజాడ అప్పారావు.

నిజహృదయ వ్యాపారాలు సాటి ఆంధ్రుల హృదయాలకి లీలగా ప్రకటించాలనే వ్యక్తులకీ, హృదయానుభవం సూచించే మాటలు పైకి అనడమే కాకుండా లిఖితంకూడా చెయ్యడం అనేది సంస్కృతాంగ్లాది భాషలు నేర్చిన తెలుగు వాళ్ళ ఎడట నామర్దా అనీ నేరం అనీ అనుకునే నాబోటి భీరువులకీ, తెలుగువాణి విహరించగల రాజమార్గాలు నిజతేజం ప్రసరించి సూచించిన స్వయంజ్యోతి—గురజాడ అప్పారావు.

జాతి మత వర్ణవ్యక్తి భేదాలూ చెడుగులూ గురించి నవ్వేసి, పెక్కు లోకటిగ చూచినవాడే ప్రాజ్ఞుడనీ, మంచి చెడ్డ భేదాలు తప్ప ఇతరభేదాలు మానవుల్లో లేవనీ ఘోషించిన కుటుంబి—గురజాడ అప్పారావు.

తన వాక్యాల్లోని ప్రత్యక్షరం బీజాక్షర ప్రాయంగా కల్పించ గలిగి, ప్రత్యక్షరం నాబోటి పామరులకి ఒరవడిగా చేసి, నూతనాంధ్ర హృదయ కవిత్వ వ్యవసాయంలో యథేచ్ఛగా ఊడుచుగునే నిమిత్తం తన రచనని ఆకుమడిగా చేసియిచ్చిన క్షేత్రజ్ఞుడు—గురజాడ అప్పారావు.

నా మాటలు చాలవు. జీవం ఉట్టిపడుతూన్న ఆయన రూపం ఇదుగో, చూడండి !!

---

# కాశీ కృష్ణాచార్యుల ఉపన్యాసము

[5—9—26 తేదీని రాజమంత్రీ ఆర్ట్సు కాలేజీకి చెందిన మెట్కాఫ్ వసతిగృహ వార్షికోత్సవమునకు అధ్యక్షులుగా శ్రీ కాశీ కృష్ణాచార్యులవారు రాజమంద్రీవచ్చినారు. నాటి ఉపన్యాసములో వారు 'భాష' గురించి మాటాడినారు. వారి మాటలోని మాధుర్యము, మార్దవము, గాంభీర్యము, పెంపు, సబబు, సందర్భము ఇవన్నియు విద్యార్థులకునూ, విద్యాధికులకునూ కూడ హృదయరంజకముగ నుండెను. ఆవేళ, ఆచార్యులవారి వాక్కులు అన్ని విన్ననూ, విద్యార్థులకు తనివి తీరనందున, ఆచార్యులవారు ఆగిపోయి మరునాడు మరల మాటాడినగాని ఏమాత్రమును వీలులేదని వారు గట్టి పట్టుపట్టిరి. ఆచార్యులవారు అటులనే ఆగిపోయి, 6—9—26 తేదీని కాలేజీ వసతిగృహమునకు చెందిన 'తిరుపతి సమాజము' అను ఒక విద్యార్థుల తెలుగు సంఘము తరపున ఏర్పాటుచేసెడిసభలో ఉపన్యసించుటకు ఒప్పుకొనిరి. ఆ దినమున అయిదింటికి మీటింగని అనుకొనిరి. అధ్యక్షులూ ఉపన్యాసకులూకూడా అయిన ఆచార్యులవారు వచ్చిరి. కొందరు ఇతరులు, ఆచార్యులవారి ఉపన్యాసము గదా అని పిలుపు లేకయే చక్కావచ్చిరి. విద్యార్థులు

మొదట హానిహానిగావచ్చిరి. కార్యదర్శిగారు బండ్రోతును పంపించి కొందరు విద్యార్థులను పోగుచేయించిరి. ఆచార్యుల వారిని ఆగవలసినదని పట్టుపట్టినవారు, అవసరమైన ఒక ఇతరపనిలో వెళ్ళి తీరవలసివచ్చినది. ఏమైననూ, ఆయా ఆప్రాంతములవరకు వేచి, చూచి, వసతిగృహపాలకులైన శ్రీ విస్సా అప్పారావుగారు లేచి, సంగతులు ఇవీ అని చెప్పి, బాలురకు సహజమైన తొందర క్షమింపవలసినదని శ్రీ ఆచార్యులవారిని బాలురపక్షమున ప్రార్థించి, ఇక ఆగక ఉపన్యాసము ప్రారంభింపవలసినదని వారిని కోరి, అది తెలుగు సమాజమూ 'ఆటవేళా' అగుటవలన అంతే మామూలు అనియు, ఆవేళే చాల నయమనియు అని, విరమించిరి. అప్పటి కప్పుడే విద్యార్థులు నలుముఖాలనుండీ గబగబా వచ్చుచుండగా, ఆచార్యులవారు ఇట్లు మాటలాడిరి.]

తొందర బాలహృదయధర్మము. ఇప్పుడు క్షమించవలసినంతటిది ఏదీ లేదు బాలుర అంతర్యమందలి సదుద్దేశమునే నేను గ్రహించెద. అది నాధర్మము. ఇక ఆటలా ? ప్రపంచకపురీతియే ఆట.

'ఆజగన్నాటక సూత్రధారి యదునందనుడు' అని. అందువల్ల, అందరున్నూ అభినయించేవారే, 'నాటకానికి వెళ్ళము' అని మడిగట్టుకుని కూర్చుండువారుకూడ అభినయించుచున్నవారే. నేను నిన్న అధ్యక్షత అభినయించినాను. ఇప్పుడు వక్తవేషము కట్టవలె. నాటకం ఎక్కడో లేదు;

కదలినా మెదలినా, నాటకమే. అంకాలును, రంగాలునూ వేసినప్పుడే నాటకమనీ, అక్కడికి పది అంకాలూ ఉంటే మహానాటకమనీ అనుకొనుట అజ్ఞానము. ఇక నాప్రస్తుత వేషములో నేను అభినయముచేయుట గురించి, ఇది, భిన్న రుచులుగల సభ్యులచే ఏర్పడిన సభ. ఇట్టిసభలో ఏదియైన అంశము చెప్పి, అది ఆ సభ్యులచే ఆచరణయందు పెట్టింప చూచునపుడు, ఆచెప్పెడివాడుకూడ అట్లనే అయిపోవలె. జాగ్రఫీ చెప్పేవాడు భూగోళం అయిపోవలె. హిస్టరీ బోధించే వాడు భూతకాలము అయిపోవలె. గణితం నేర్పేవాడు అంకెలక్రింద మారిపోయి ఊరుకోవలె. ఆ ఏకముఖత్వం, ఆదీక్షా, కలుగవలె. రఘువంశ పఠనంలో శ్లోకం ఒక్కంటికి ఒక చింతపిక్క అట్లా పారేసి మరీ తరువాత శ్లోకంలోకి వెళ్ళే వారు. రాముని వేషము చూచినతరువాత, రాముని శీలము మన మనస్సులలో ముద్రితమైనచో, ఆ రామపాత్రధారి రామునితో అభిన్నుడై అభినయించి ఉండవలె. చెప్పెడి వారంతా అంతే. వక్త అంతే. మేష్టరుకూడ అంతే. ధ్యానము ఎక్కడనో పెట్టి, మతి మతిలో లేక వ్యాకరణము చెప్పుచున్న ఒక ఉపాధ్యాయుడు 'సంభావనాయాం లోట్ కర్తరి క్తః' అని నోటంటగొణిగి, దానికి 'కర్త రిక్తుడైతే సంభావన తప్పకుండా లోటుగాఉంటుంది' అని చెప్పి పారేసి నాడట. అట్లాకాకుండా వ్యాకరణంలో పతంజలీ, తర్కంలో గౌతముడూవంటి సర్వజ్ఞుడు కావలె చెప్పేవాడు.

సరి, మరిప్రస్తుతం ఉపన్యాసం ఏమిటీఅని, దేనినిగురించో మీరు నాతో చెప్పడం మరిచిపోయారు, నేను లోపలఅను

కోడం మరచిపోయాను. అందుకని తలో శాస్త్రం మాటాడ తాను. అందుకని దీనిని కలగాపులగపు ఉపన్యాసం అందాం. చాచా. ఇల్లాంటిది వట్టి భ్రష్టుగా ఉండకూడదుష్మీ మళ్ళీ! శాస్త్ర శాస్త్ర అన్నీ కూడ ఇందులో ఉంటూండాలి, తద్దినపువ్యాపారాలలో, కూర, కేవలం ఒక్కటే కాకుండా మూడు నాలుగు సంపుటీ చెయ్యమన్నారు. ఎందుకు ? అట్లా చేసినట్టయితే, భోక్త, ఇష్టం ఉన్నది స్వీకరించి, ఆరగించి, లేనిది పరిహరించడానికి వీలుంటుందని. ఇప్పటి ఉపన్యాసాలలోగాని, ఇతర పనుల్లోగాని సభ్యులకు ఎందులో రుచియో కనిపెట్టి అవి చేస్తూండడం బహు తక్కువ. తెలుగుపంతులు కుర్రవాడికి “ఉకారమునకు సంధి నిత్యము” అని చావగొట్టి చెప్పినాడు. కాని, వాడికి అది రుచించక, అది ఏమిటో అసలు అక్కర్లేక మర్నాడు పారల్ బార్సుమీద కూర్చుని ఆమాట తోడిరాగంమీద ఆలాపన చేశాడు. నాలుగువందలమంది విద్యార్థులు కలిసి చదివినప్పుడు—ఒకేకాలము, ఒకేపాఠము, ఒకేమేష్టరు దగ్గిర, తక్కువమంది ప్యాసవడమే ? ఏం తక్కువ ? కొందరుకొందరు “నేను ఈ క్లాసును ఆశ్రయించాను; ఈ క్లాసు నన్నాశ్రయించింది” అన్నట్టు ఆ క్లాసులోనే ఉండి పోవడమే ? డబ్బుకొదవా మరేంకొదవ ? ఏమీకాదు. వాడికి అందులో లేదు. “వాడు ఎప్పుడూ అంతే. ఎందులోనైనా అంతే.” అనగలరేమో, ఎవరైనా! వాడికి భగవంతు

డిచ్చిన తెలివి అట్లా కొట్టి పారెయ్యవద్దని నేనన్నాను! మీరెవరు? మీది పూర్వాచారమూ నవీనాచారమూ అని కొంతమంది నన్ను ప్రశ్నించారు. ప్రశ్నించితే నాది నవీన పూర్వాచారమని నేను చెప్పవలసివచ్చినది. ఏమైతేం, ఇప్పటిచదువు, తరువాతజీవితంతో సంబంధం లేకుండాపోయింది! డిప్యూటీ కలెక్టర్ని జాగ్రఫీలో ప్రశ్న వేస్తే, ఒక్కముక్క చెప్పలేడు. ఫ్రాన్సు కాపిటల్ కాబూలు అంటాడు. చిన్నప్పుడు అవన్నీ ఫస్టుగా చదివాడు. అయితేం మళ్ళీ అక్కర్లేదు. ఇంత చదువూ అక్కర్లేనిది చదివేసి, విద్యార్థి, రోగపీడితుడై చచ్చిపోవడమూ కద్దు. అది వైద్యులు డయాగ్నోజు చేసి హార్ట్ డిసీజ్ అని చెబుతూంటారు. సాధారణంగా చచ్చిపోయిన తరువాతగాని ఈ రోగముయొక్క వయినం తెల్సూండదు. ఇట్లాంటి చదువుకి వెచ్చించిన కాలం పన్నెండేళ్ళు. ఇప్పుడు ఆర్థికంగా పడే పాట్లలో శతాంశం పడి, చెయ్యవలసిన రీతి చూచుకుంటే, ఈ సర్వమూ మూడేళ్ళలో సాధించవచ్చు- అస్ఖలిత బ్రహ్మచర్యవ్రతం చేసి, ఇంద్రియములన్నీ స్వాధీనపర్చుకున్నట్టయితే! ఈ రెండూ లేని పట్ల, పుష్కరాలు వచ్చి పోతూనే ఉంటాయి. చదువూ అట్లానే ఉంటూంటుంది చాంద్రాయణంలాగ! క్రియముక్క, ఇప్పటి చదువు ఎందుకూ అంటే, ఎక్కడో కొంతజీతానికి సర్దుకొని మళ్ళీ కొంతమందికి ఇదే చెప్పడానికి- అంతేగాని చెయ్యడానికి కాదు. నా కాలూకు ఎలక్ట్రిక్ లైటు, అయిదుర్థాపాటు

లని, పాడైపోతే, ఆ యొక్క తత్వం చదువుకున్న పండి
తుడు సార్లాచేస్తాడు, అని ఒక సైన్సు బియేకి ఇస్తిని
గదా, మళ్లీ బాగు చేయించుకోడానికి వీలు లేకుండా చేసి
నాకు మాసంనాటికి ఇచ్చేశాడు. అహా! మంచివాడే.
మామూలుగా అయితే, ఆరణాల డబ్బులతో బాగుపడు
నుట. కాని, స్వతంత్రబుద్ధి ప్రయోగించి కొత్త కల్పనలు
చేస్తూండడం కూడా జరుగుతూనే ఉన్నది స్మండి! అరు
దుగా! రైలు, పట్టాలమీద వంపు తిరగడానికి సెంట్రీపిటల్
ఫోర్సా అదేదో చూచి, ఒకపట్టా ఎంత ఎత్తుండాలో
కనిపెట్టారు. బోసుగారు, చెట్లు, చెట్లచలనం, చెట్ల జీవం
గురించి కొత్తసంగతులు తీశారు. కొన్ని సంగతులు
హరివంశంలో అల్లాంటివి ఉన్నాయి. కాని చేసేబుద్ధులు
మనలో బయలు దేరంటంలేదు ఈ క్రికెట్టు మనలను
రక్షించదు, ఈ టెన్నిసు మనలను పాలించదు. అంతః
కరణము, మనస్సు, చిత్తము, బుద్ధి, చైతన్యమూ,
అహం—వీటికి బాగా స్టీము ఎక్కించి, వీటి సమీకర
ణంతో బయలుదేరిన శక్తి సంపాదిస్తే, అది చాలా
చేస్తుంది. దానిచేత నిజముగ, అనంతము, అమూల్యము,
నిత్యము. ప్రస్తుతపు చదువంతా కలిపి ఇచ్చేది ఏమిటంటే,
భాష ఎండ్ ఫోర్ సింపిల్ రూల్సు! అయినాగానీ, తల
దూర్చడం అయిందిగనక, తప్పకుండా చదివి, తరవాత
మన సంఘదుర్దశ చూచి, తరుణోపాయం ఆలోచించవలె,

ఋణాల్లోంచి తరణోపాయం కూడా కనిపెట్టుకోవలె. పూర్వ మతకర్తలు ఒక్కొక్క భావంతో ఒక్కొక్క పుస్తకంతో పూర్వపుస్థితి అంతా తల్లకిందులు చేస్తూ వచ్చారు; శంకరాచార్యులు, బుద్ధుడు, రామానుజాచార్యులు లాంటివారు! ఇప్పుడుకూడా అటుల ఏల చెయ్యలేరో! మున్ముందు, హృదయాలలో ఉండే దుర్గుణాలు పోగొట్టుకోనవలె. మీ రందరూ మత్త్రిగింజల వంటివారు. న్యాయాధిపతి, జ్యోతిష్కుడు, పండితుడు, అందరూ మీలోనే ఉన్నారు. వారు పెరగవలె.

సరి, దేశము పాడై పోవునపుడు ఎవడో బయలుదేరి దాన్ని ఉద్ధరించి తీరుతాడు. అదీ చరిత్ర. ఉద్ధారణకు సాధనము విద్య. అది రెండుభాగములు :

ద్వే విద్యే వేదితవ్యే, పరాచైవాపరాచ- అని వేద వాక్యము, అనగా పరవిద్య, అపరవిద్య, అని రెండు. అపర విద్య భూమిమీద కావలసినదే, అనగా ఎంచేత ? నశించేది. ప్రకృతి నాశనమే కోరుతుంది, హేతువాదనకి అందదు. అయితే నశ్వరం అయిన ఈ అపరవిద్యగురించి ఏల పాట్లు ? అనిఅడిగితే, కంటపడేదానితో కంటపడనివి గ్రహించడానికే, మీరు భూగోళశాస్త్రం చెప్పేటప్పుడు, కంటపడేభూమి ఉంటూండగానే, గ్లోబు చూపిస్తారు కుర్రాడికి—దానిమీద గీతలు భూమిమీదకూడా ఉన్నాయి కాబోలు అనుకుంటాడు కూడాను ఒకొక్క విద్యార్థి! ఎందుకు, అటుల ? అంటే!

భూమి అందుబాటుగా లేకపోవడం వల్లనే. అపరవిద్యనుండి పరవిద్య ఊహించవచ్చు. అష్టత్రింశత్ మతం సందర్భంలో విద్యారణ్యభాష్యంలో అయిదువేల ఎటోస్ఫియర్సు చెప్ప బడినాయి! ఏడు శక్తులు చెప్పబడి ఉన్నాయి.

(1) శబ్ద (2) ఉష్ణ (3) తేజ. (4) జాంతవకాంత (5) విద్యుత్ (6) యోగ (7) చిత్ శక్తులు.

అనగా ఫిజిక్సులో ఉండే—(అంటే ఇంగ్లీషులో) సౌండు, హీటు, లైటు, మేగ్నెటిజమ్, ఎలెక్ట్రిసిటీ. కడమా రెండిటికీ ఇంగ్లీషు ఏముందో నాకు తెలియదు. మొదటి ఐదూ అపర విద్యలు. ఏడవది పరవిద్య. ఆరవది యైన యోగము రెంటికీ సంధి. కాబట్టి అది సగము ప్రాపంచికమూ, సగము దైవి కమూ అయిన మనస్సునకే సాధ్యము.

అయితే, ఇప్పటి మన మనస్సు అయ్యవార్లంగారి గుర్రాన్ని అనుసరించి ఉంది. పూర్ణవికాసానికి వీలులేదు. అంతా దాని ఇష్టసే. అయ్యవార్లంగారికి గుర్రం ఉండేదిట. ఎక్కడమే అల ఆయనపూచీ. ఆతరవాత పూచీ యావత్తూ గుర్రాందేఅట. సాధారణంగా ముళ్ళల్లోకీ గోతుల్లోకీ ఈడ్చే స్తూండేదిట, ఇహ ఆయన దానిమీాద కూచుని మొత్తుకున్నా సరేలబ్బున, అంతేట. కాని, ఎవరేనా ఎదరపడి 'నమస్కార మండి, అయ్యవార్లంగారు' అన్నారా ఆపళంగా ఆగిపోయి కోసినా మరి కదిలేది కాదట. అందుకని, ఎవరేనా ఎదురు

గుండా వస్తాంటే, అయ్యవార్లుంగారే ముందు అవతలవారికి నమస్కరించి, తనుకూడా 'నమస్కారం' అనేమాట నోటంట రాకేక 'అయ్యా, చిత్తం' అనేమాట అనకండి, నాగుర్రం ఆశిపోయింది [illegible] నమస్కరించి పోయే వాళ్లు. ఆ సాహెబితే [illegible] ఏమి చెబుతూన్నా సరే కుర్రాళ్ళకి. సమయంలో మార్చి కొత్తది చెప్పాలట. పిల్లలు చేయవలసిన పనులు గుర్రాళ్ళచేత,— ఆపిల్లలనిచూస్తే నాకు 'పిల్లి కూనలా' అనిపించి జాలేస్తుంది. వాళ్ళకి ఆసనాలు పలు పద్ధతులు! ఎన్నైనా నాలుగు ఆసనాలలో పోనీ ఏ ఒకటో, రెండో! పశ్చిమ తానాసనం అభ్యసిస్తే కాన్స్టిపేషన్ ఎప్పుడూ పుట్టదట. అయినేం? ఏమో? కాలం మారిపోయింది!

సరళి దాటిన వెనక సరిగమ మాపని యని పాట పాడు గాయకులచేత! పైసేకరీ భ్రష్టవిద్యాంసులై కలమాడకయె వ్రాయగల మహాకవులచేత! వల్మీక ముక్తికేశ్వరము మున్నగు కుక్కపిల్ల నంచుల భిషగ్వరులచేత!

అయ్యా, వైద్యులండి, వైద్యులు! 'ముక్తికేశ్వరం' ట తమరిమందు. ఒక్కమోతాదు పుచ్చుగుంటే మళ్ళీ పుచ్చుగో అక్కర్లేదట. నా కోపానికి పాపువైద్య మంటే సత్పాత్రం అనేమాట నిజమే. చాలామందిని నేనే ఎరుగుదును. ఒకొక్కడు మందివ్వబోతాడు! తీరాచూస్తే, 'తనకే బోలెడు దగ్గు నుబ్బసము...' నక్క, ఊరుబయట ఏడుస్తూ

పోతూంటే, రాంబంటు ఏడుపడి 'ఏం, నక్కబావా, అట్లా ఏడుస్తున్నావు' అందిట. అంటే నక్క, పట్టరాని ఏడుపుతో 'ఏముంది, అంతా అయిపోయింది.' అందిట! 'ఏంకర్మం' అందిట రాంబంటు. 'మాఊరి వైద్యుడు పోయాడు' అందిట నక్క. అంటే 'ఏడుపెందుకు నవ్వక' అందిట రాంబంటు. అంటే 'ఇహ, నాకు శవాలు ఎల్లా దొరుకుతాయి' అని గొల్లుమందిట నక్క.

మరొక ఊళ్ళో ఒక ఆసామీ పోగా, అక్కడికి ఊరి వైద్యుడు వచ్చి 'ఏమిటి' అని అడగ్గా, సంగతి చెప్పారట. చెపితే ఆ వైద్యుడు 'మరి, నేనూ మా అన్నయ్యాకుడా ఇవ్వలేదే మందూ, ఎల్లా పోయాడీతా' అని ముక్కుమీద వేలెట్టుకున్నాట్ట.

సంపాదనంబె యాత్రీమధర్మమని దేశసంచారు లాయతీ శ్వరులచేత

వర్ణమతధర్మములు రూపు బాసియున్న
నుండినట్టుల జెలగుచు నుండె నంబ
ధర్మ మడుగంటె మింటికధర్మ మంటె
సత్యమూ చచ్చె జనుల కసత్య మెచ్చె॥

ప్రకృతి వైద్యం కోరదు. పశువులకి రోగాలూ, పశువులకి ఆసుపత్రులూ, మొదట్లో లేవు. అవి, మానవులతో సహవాసం చెయ్యడంవల్ల వాటికి ఆ యిక్కట్లు సంభవించాయి. ఎన్నడూ మానవుడు వెళ్ళిఉండని కంభంవద్ద ఉన్న ఒక చెరువుగట్టున

ఉండే ఆవులపాలు తెప్పించి త్రాగి, ఇక్కడ ఆవులపాలు త్రాగి నేను చూడగా, ప్రకృతికీ మనకీ తేడా తెలిసినది. మనం ఒకరికి సహాయ్యం చెయ్యాలి అనేవాళ్ళం. చెయ్య లేకపోతే దణ్ణం అయినా పెట్టాలి అనేవాళ్ళం. ఎందుకైనా, ముందు శరీరాన్ని చక్కజేసుకోవాలికాని, ఒకవేళ జబ్బు చేస్తే, ఆ తరవాత మందు అహారిస్తాను అనకూడదు. 'ప్రివెన్‌షన్ ఈజ్ బెటర్ దెన్ క్యూర్' అని గావును ఇంగ్లీషులో. 'ఉత్పన్నప్రతీకారాత్ అనర్థస్య, ఉత్పత్తి ప్రతిబంధయేవ వరం' అని సంస్కృతంలో. వీళ్ళల్లో ఎవరు ఎవర్ని చూచి వ్రాశారో కాని రెండూ ఒక్కటేభావం! గొప్పముక్కలు ఏకీభవిస్తాయి.

సరి ప్రపంచములోనికల్లా ప్రాణమునకే ఎక్కువ విలువ. అన్నీ దానికోసమే. సాక్ష్యాలు సంపన్నాలు అబద్ధాలు దొంగతనాలు, ఫోర్జరీలు ఇవన్నీ అందుకేగద. అల్లాంటి ప్రాణాలు, పంచప్రాణాలు పట్టుగెళ్ళి ఏల డాక్టరుచేతుల్లో పెట్టి ఊరుకుంటారో బోధపడదు. ఆపరేషన్ చెయించుగుని ప్రాణాలు వదిలేవారున్నారు. అట్టివారలస్థితి 'వైద్యుడా నేను చావలేకుండా ఉన్నాను. కాస్త నన్ను చంపిపెడుదూ' అన్నట్టుంది. ప్రకృతిని, పరిశోధించండి 'కన్ను' చూడండి. హృదయమును పరీక్షించండి. ఒక గులాబిపువ్వును వీక్షించండి. ప్రకృతిమహిమ గోచరిస్తుంది. దానిరంగు పరిమళము మార్దవము మనోహరములు.

జాజిన్ రాజిలు మార్దవమ్ము మరి రోజాపూవు టందమ్ము, జవ్వాజిన్ గుమ్మౌదు కమ్మతావి, మధు రంభా శర్కరా పూపికా(ఖాదన్ మాధురి తేటతెన్గునకు సంప్రాప్తించునే కాని, రాదే జన్మానికి నిష్ఠురంబయిన బర్హిర్వక్త్రవాగ్విఖరిక్.

ఈ పద్యము నేను నిన్న భాషగురించి మాటాడినపుడు చదువవలసినది. ఒక్క ప్రసూనమే అట్లున్నప్పుడు ఒక్క జంతువే అట్లున్నప్పుడు, మానవశరీరమునందలి ఒక్క అవయవమే అంతి అద్భుతమైనప్పుడు, ఇక మానవుడు ఎంత అద్భుతముగ కల్పింపబడియుండును ? ప్రకృతిలో దోషము లుండునా ? లోటులుండునా ? చూచెడి నేత్రమున, ఆడెడి జిహ్వయందు, వినెడి కర్ణమున ఆ దోషము లుండవలయును గాని, ప్రకృతియందుండవు. ఎటువంటి శరీరాన్ని సృష్టించి ఇచ్చినాడండీ, ఆయన !

అయ్యో ! ఎంత పాడై పోయినాము !

బుట్టెడంత విభూతి పులుము మోముల నూడిపించి, పంజాల జేయించినావు! రుద్రాక్షబోల్ శిరోరుహాబంధ మూడదీయించి సర్వమ్ము బోడించినావు । గన్నేరుచాయ నీర్కావిపంచెలను విప్పించి, యిస్త్రీల గట్టించినావు । దివ్య సాల గ్రామతీర్థపానము మానిపించి, సోడాల ద్రావించినావు। ఒక్క డననేల నీకు వీలున్నవరకు । చెప్పరానిమార్పుల నెన్నో చేసినావు । బళిర కృతసన్మనస్తాప పరమపాప । కలిమహారాజ సకలసాంకర్యబీజ॥

కాని, ధర్మశాస్త్రాల్లో ఏమి చెప్పినారూ, అంటే, ప్రాయ
శ్చిత్తాలు చేసుగోండయ్యా, పాపాలు దగ్ధమైపోతాయి, అని!
అయితే, నవీనులు ఏమంటారు? 'పురాతనపువాడు ఏదో
ఒకటి చేస్తే పాపం అని పెట్టుగున్నాడు. అదేచేస్తే పుణ్యం
అని నేను పెట్టుగున్నాను. ఆ పాపాలకోసం పెట్టిన ప్రాయ
శ్చిత్తాలు నామీంద నేనెందుకు అప్లై చేసుగుంటానుగనక?
నా ఇష్టం! నేను రిఫ్రెష్ మెంటుహాన్కి వెళ్ళి హాయిగా స్వీట్
పొటాటో లగాయిస్తాను. దానికి ప్రాయశ్చిత్తమేమిటి?
నాన్సెన్స్ పోక్ పోవయ్యా' అని! అవును. ప్రాయశ్చిత్తం
అంటే నాకూ నమ్మకం లేదు. కాని ఈ తినేవస్తువులు తిన
డానికి మనం ఎంతవరకు అర్హులం? మనమాత ఇచ్చిన
వస్తువులు లేవా? మనమాత మనకు జబ్బువస్తువులు
ఇస్తుందా? మనమాత ఇచ్చినవాటికంటె మంచివని
మరొకరు ఇచ్చినవి అసలు మంచివేనా నిజముగా? అని
ఆలోచించి మరీ ఆ వస్తువులు తీసుగోవలె! ఆర్యవంశస్థులం
అని పేరు పెట్టుగున్నవారం గనక, మనం దేనికీ జడవ
నక్కర్లేదు, వణకనక్కర్లేదు, ఖంగారుపడి షాక్కి అవస
రము లేదు. నిర్భయంగా, అడిగి, వాదించి, సందేహనివృత్తి
చేసుగుని, ఆచరణకు దిగవలె. 'ఏదోఒకటి, పోనిస్తూ'
అనవద్దు. అందుకని, ప్రకృతి ఎటులఉన్నదో చదువవలె.
ఎక్కడా? అంటే, లైబ్రరీలో. ఆ లైబ్రరీ సామాన్యముగా
ఉండే పుస్తకాల లైబ్రరీకాదు. ఇక్కడేఉన్నది, ఇప్పుడే
ఉన్నది, ఇతడికేఉన్నది అనే నియమం దానికిలేదు. అద్దే

ప్రకృతి, అనంతము, అగమ్యము దారుణము, మనోరంజకము, అనుభవైకవేద్యము.

ఖరశీతరుచిరుచుల్ కత్తిచే చెక్కనక్కర లేని కలము సంఘములు గాగ। పహాటి కొకచుక్క యేని ముంకని వార్థి మండలములు మషీమణులు గాగ। భూనభోంతర భాగములె స్నిగ్ధతర శాశ్వతములైన గ్రంథపత్రములుగాగ। జంతుమానవ వృక్షజడ భేదభిన్న రాజ్యములెల్ల దివ్యపద్యములుగాగ। బహురసగ్రంథముల పరబ్రహ్మసుకవి। వ్రాసి బ్రహ్మాండ పేటిక భద్రపరిచె। గాన వానిని జదివి సుజ్ఞానమంది। ధరణి సౌఖ్యము గనుడు సోదర్యులార.

'ప్రపంచం, ప్రపంచం' అంటే హిందూదేశం దాటి మన వాడెవడైనా పూర్వపువాడు వెళ్ళినాడా, అని అడిగితే ఉన్నాయి ఉదాహరణలు. జగన్నాథపండితుడు తన శిష్యుల్ని కొందరిని అరబ్బీదేశం పంపించినాడట. మంచి అనేది ప్రపంచం అంతటా వ్యాపిస్తుంది. ఇప్పుడు మీరు నేర్చుకునేదానిలోనుండా మంచి గ్రహించండి, చెడు వద్దు.

బాలురు నేను మాటాడడం ప్రారంభించిన తరువాత గుంపులుగుంపులుగా వచ్చారు. హాలు కిటకిటలాడుతోంది, కాని ఇది చిన్నహాలేలెండి. కాబట్టి కాస్త జోరుగా విసిరేస్తున్నాను మాటలు. అల్లాపడో ఉత్సాహంగా ఉండాలిగాని కిందనమాటు హిందూసమాజం మీటింగుకి అయినట్టు కాకుండా ఉంటే సరి. సరి, ఇక అయిదు నిముషాలు,

ఉపన్యాసం ఏదో విలాసం అనుకోడం తప్పు. దాని కేమిటి? చాలామంది ప్రతీదీ విలాసం, తమాషా అంటూం

టారు, తమరు అది చెయ్యవలసి వచ్చినప్పుడు తప్ప. శుక శౌనకాదుల సభా, సభ్యుల సంఖ్యా, వింటే ఆశ్చర్యంగానే ఉంటుంది. 'అష్టాశీతి సహస్రాణాం ఋషీణాం భావితాత్మనాం' అని ఎనభైఎనిమిది వేలమంది కూర్చోవడం, వినడం, ఒక్కరే ప్రశ్నిస్తూండడం, జరిగి ఉండాలంటే వారు చాలా శిక్షితులై మరీ అది నిర్వహించి ఉండాలి. అప్పటివి ఎందుకు? 1920 మే నెలలో నేను హరిద్వారము ఋషికుల బ్రహ్మచర్యాశ్రమం చూశాను. ఖనకల్ గురుకుల ఆశ్రమం చూశాను. అవే మన విద్యను నిలబెట్టినచోట్లు. ఒక్కొక్క ఆశ్రమంలో అరవైనలుగురు ఉంటారు. పెద్దపెద్ద వసతిగృహాలు బారులుతీర్చి ఉంటాయి. ఒకొక్క బారులో విద్యార్థి నాలుగేళ్లుండి మరియొక బారులో ప్రవేశిస్తాడు. వాళ్ళ నమస్కారం అంజలి, ఇప్పటి మన అర్ధ నమస్కారం కాదు. అంజలిలోని విశేషము మెస్మరిస్టుకు తెలుసును. అది పవిత్రము. అందువల్ల ఆమాత్రం అయినా మనం మారి, మంచివి మరల అభ్యసించాలి! 'గుడ్ మార్నింగ్' మాని, హృదయపూర్వక నమస్కారం; 'అధ్యక్షుని అంతోపన్యాసం' అనేది మాని-ఎందుకంటే అధ్యక్షుడు అంతటితో అంతరించడుగామరీ-చురో ముక్క. దేనికైనా ముగింపు చెప్పేటప్పుడు 'స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం' అనే మాటలు, అనగా, అందరికీ క్షేమము, రాజులు న్యాయముగా ప్రజలను పాలింతురుగాక, గోవులకు శుభము. తరువాత బ్రాహ్మణులకు. అనగా అఖండప్రపంచమునూ నింపుటకు సరిపోయెడు తేజస్సుగలవారికి, అంతేగాని 'జాతిమాత్రోపజీవు' లైన బ్రాహ్మణులకి కాదు. యూని

వర్సల్ బ్రదర్‌హుడ్ మనకు విధియే. కొత్తగాదు. ఇల్లు ఎవరిదీ ? అందరిదీకుడాను. అతిథీ అభ్యాగతుడూ వస్తే, వాడిది కుడానూ! కాని, ఒకడికి అని ఎందుకు అంటున్నారూ అంటే అది వాడు కాస్త బాగుచేయించడానికీ, పన్నూగట్రా చెల్లించడానికీనూ, ఒకడంటూ లేకపోతే మరి ఎవడూ చెల్లించడు. తనకి ఒక్కనికోరకే కట్టుగున్నది ఇల్లుకాదు, వల్ల కాదు. అదిమాత్రం ఎవడికి కావాలీ ?

> చీరాణి కిం పథి న సంతి దిశంతి భిక్షాం
> నో వాంఘ్రిపాః ఫలభృత స్సరితోప్యశుష్యన్.
> రుద్ధా గుహాః జితో౽నతినోపపన్నా।
> న్కస్మాద్భజంతి కవయో ధనదుర్మదాంధాన్

ఏదైనా, పాపం, ఇంగ్లీషులో వ్యాఖ్యానం చెబితేగాని తెలియదు. అదీ మనఅవస్థ. చక్కనిభావాలు గల్గిన సంస్కృత శ్లోకాలూ తెలుగు పద్యాలూ, నేను చదివినప్పుడు విని, కిమ్మనక, అవి యేమని చెబుతూన్నవో చెప్పిన తరువాత (ఇంగ్లీషు మాటుపెట్టి). ఓహోహో అనేమీారు మనభాష ఎప్పుడు నేర్చుగుంటారు ! తెలుగునకు తల్లిభాషయైన ఆ సంస్కృతమును ఎప్పుడు ఉద్ధరిస్తారు ? వ్యాఖానం అవసరము లేకయే, నేను శ్లోకము చదివీచదువుటతోడనే గ్రహించి ఎప్పుడు ఆనందిస్తారు ? ఎప్పుడు మన ఆంధ్రత్వం నిలపెడతారు ! అప్పుడుగాని భారతమాతకు మనస్సు స్థిమితపడదు. అన్నిమతములనూ, అన్నిజాతులకూ, అన్నివర్గములకూ, అన్యోన్యత ఉండవలయునని నేనంటినేకాని మరల మమేక

మునూ, సాంకర్యమునూ నాకు అసహ్యమే. నాకే కాదు అందరికినీ అంతే. ఆయుర్వేదంలో:

ప్రసంగాత్ గాత్రసంస్పర్శాత్ నిశ్వాసాత్ సహభోజనాత్
ఏకశయ్యాసనాచ్చాపి వస్త్రమాల్యానులేపనాత్
కుష్ఠం జ్వరశ్చ శోషశ్చ నేత్రాభిష్యంద ఏవచ
ఔపసర్గికరోమాశ్చ సంక్రామంతి నరాన్నరం. —అని,

ఉంది. అందువల్ల నే కోరేది మైత్రియే, సోదరభావమే.

సభ్యులారా, ఇంతవరకు, నాకు తోచినది, ఏ వెఱ్ఱియో మొఱ్ఱియో నేను మాటాడినాను. ఇది తిరుపతి సమాజము. శ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులు వెనుక ఒకచోట అవధానము చేయగా నేను అధ్యక్షత వహింపవలసివచ్చింది. అవధాన సమాప్తియైన తరువాత, అంతా వారిమీద ఆశీః పద్యములు చెబుతూ, 'భగవంతుడు తిరుపతి వేంకటేశ్వరులను రక్షించుగాక' అని అర్థం వచ్చే పద్యాలు ఆశువుగా చెప్పడం మొదలుపెట్టారు. అప్పుడు నాలో నేను, ఇదేమిటీ? ప్రతీకవీ వారిద్దరికే క్షేమం కోరుతున్నాడు! కడం వాళ్ళమాటేమిటీ! కడంవాళ్ళకి క్షేమం లేనప్పుడు వారిద్దరికే ఉండే క్షేమంవల్ల లాభం ఏమిటి?' అని ఆలోచించుకుని నావంతు వచ్చినప్పుడు నేనూ ఒక పద్యం చదివి వారితోపాటు మమ్మల్ని అందర్నీ కూడా రక్షించవయ్యా, దేవుడా, అని కోరి ఉన్నాను.

పదిమందిలో బట్టపవలైన నిలువెల్ల దోచి తోచని పచ్చి దొంగవాడ! పరికైనను తిరుక్షౌరమ్ము చేయించి పంగ నామముపెట్టి పంపువాడ! వడ్డిలోకాసైన వదలకంతకుసంత

సుంజగై కొను రాతిగుండెవాడ । కడుపేదనని మొఱ్ఱలిడ నెత్తి బొచ్చై యన పెట్టిపొమ్మని యడ్డుపెట్టువాడ । అడుగడ్డునకు మ్రొక్కి ముడుపుగట్టెడు భక్తకోటి బ్రోచెను లంచగొండె వాడ।

ఇన్నిగల్గియు సిరియె లేకున్నవాడ
పేరుగొప్పయె చూడగ నూరు తిప్ప
అనేక న్యాయంబునకు లక్ష్యమైనవాడ
సరస తిరుపతి వేంకటేశ్వరులతోడ
మమ్ము దయచూడు మలివేలుమంగతోడ.

ఆర్యులారా, నేనేదో ఆరోగ్యవిషయకముగ, భాషా విషయకముగ, మతవిషయకముగ కొన్ని కొన్ని మాటాడితిని. సందర్భము కలుగగానే, నేను మిమ్ము మరలవచ్చి చూచెదను. అప్పటికి మీరు ఏదియైన అభివృద్ధి, ఏదియైన సదభ్యాసము కనబఱచినచో, అదే నాకు పరమానందము.

నేనాడిన మాటలలో నాకు ఏ ఒకరిపైననూ కోపముండికాదు. పాడువైద్యాన్ని నేనేదో అన్నప్పుడు, వైద్యులకు ఏమీ ఆగ్రహము వలదు. ఏ మతమునూ నేను నిరసించను. అందువలన, శివపరముగానునూ, విష్ణుపరముగానునూ, శ్లేషించి చెప్పిన ఒక శ్లోకముతో నేను విరమించెదగాక:

గవీశపత్రో నగజార్తిహారీ కుమారతాతః శశిఖండమౌళిః
లంకేశ్వరారాధితపాదపద్మః పాయాదనాదిః పరమేశ్వరో నః॥

# విశ్వనాధ సత్యనారాయణగారి రచన

సృష్టిచేసేవాళ్ళకి మన్నన లేకపోతూంటుంది. జగత్తు సృష్టించాడని మనం అనుకునే బ్రహ్మకీ అంతేగదా! కారణం ఏమిటంటే, అతని కష్టం తెలుసుకోడానికి ఆకాలంలో ఎవడూ లేకపోవడంవల్ల. అల్లాగే, శరీరం సృష్టించే తండ్రికీ, బుద్ధి సృష్టించే గురువుకీ జరగవచ్చు. అదేమో స్థరుగా, పదసాహాయ్యంవల్ల రసం సృష్టించే కవికి! అలాకాకుండా, జనం, ఏ కవినైనా సరే గౌరవించారంటే, మానవజన్మయొక్క విశేషలక్షణాన్ని వాళ్ళు వ్యక్త పరుస్తున్నా రన్నమాట. అందులో సార్థకకవిని గౌరవిస్తే మరీనూ! అందులో విశ్వనాథ సత్యనారాయణగారిని గౌర విస్తే అంతకంటేనూ! అందులో ఏనుగుమీద! సత్యనారా యణగారికే కాక కవిత్వానికి జనం తమరి హృదయంలో అంత ఉన్నత స్థానం ఇస్తున్నారన్నమాట!......

చేతా వాతా, నోటితోనూ గాత్రంతోనూ ఆయన వ్యవహరించగలడు. తెలుగుమీద నిలబడి ఒకచేత్తో సంస్కృతం ఒక చేత్తో ఇంగ్లీషూ ఆయన లాక్కున్నాడు. నమ్మిన విషయం నిలబెట్టుకోడానికి ఆయనికి దేవుడు మొదలు దెయ్యందాకా ఎవరన్నా భయంలేదు, భక్తీలేదు. సనాతన ధర్మానికీ ఆధునిక నాగరికతకూ ఆయన హృదయంలో

సంగ్రామం జరిగింది. ఆయన పురాణ మంత ముసలి, వ్యావహారిక భాషంత బాలుడు. పాతదిగనక సర్వం తీసై, కొత్తదిగనక సర్వం మెచ్చె, అనడం ఆయన మతంకాదు. పురాణం చూచేటప్పుడు భూత అద్దాలు పెట్టుకుని చూడనూ, నేటి విషయం చూసే టప్పుడు కంటిమసుగ లేకుండా చూడనూ, అని ఆయన కోరేది. అటు షడ్దర్శనాలూ శాస్త్రాలూ లగాయతు ఇటు సహస్రాధికంగా ఉండే నవీన సమస్యలూ సందర్భాలూ వరకూ ఆయన కూలంకషంగా అన్వయించు కోడమే కాకుండా, సమన్వయం చెయ్యడానికి కూడా పాటు పడ్డారు. గద్య పద్య గేయరూపాలలో ఖండా ఖండ రచనల్లో, శతక పురాణాలలో నవలా నాటకాలలో, ఆఖ్యానాఖ్యాయికలలో ఆయన వాక్కు విహరించింది.

ఆయన రచనచూస్తే, పూర్వీకుల ఆంధ్రరచన ఇటు జరిగినట్లూ, నేటికాలపు ఆంధ్రరచన అటు జరిగినట్లూ అనిపిస్తుంది. ఆయన రచనలో మహాపండితులు ఆగిపోవలిసి వచ్చేచోట్లు ఎల్లాఉంటాయో, అల్లాగే పామరులు నిత్య కృత్యంలో వాడుకునే పదజాలంవచ్చేచోట్లూ అల్లానే ఉంటాయి. ఆయన రచన నన్నయ తిక్కనల సీసాలు మొదలు గురజాడకవి గేయాలవరకూ వ్యాపించింది. ఆయన పదాలకూర్పు ఎక్కాప్రగడని జ్ఞాపకం చెయ్యడమేకాక, ఏక సమాసపద్యాలుగల ఆయన శతకం ఆముక్తమాల్యదకర్తని

స్ఫురింపజేస్తుంది. ఆయన పురాణరచన దృశ్యప్రబంధం అనీ, ఆయన నాటకరచన ఊహాప్రబంధం అనీ, ఆయన నవలారచన ఆత్మప్రబంధం అనీ, ఆయన గేయరచన ప్రకృతి ప్రబంధం అనీ నేను అనుకుంటాను. ఇటువంటివి ఆయన రచనలో చమత్కృతులు! పాత్రసృష్టికి గిరీశా, స్వాతంత్ర్యేచ్ఛకి ప్రశాస్త్రీ మరవరానివి. ఆయన రచనల్లో ఉండే సంభాషణలలో గల చమత్కారం, ప్రబంధపుష్పలావికల వక్రోక్తులలాగ ప్రౌఢం. ఆయన రచన ఆంధ్రులకి అవసరమైన ఒక సంస్థ.

(జనవరి, 1942)



# త్యాగరాజు

సుమారు వందసంవత్సరముల క్రితం—అనగా 1847 సంవత్సరంలో— చోళమండలంలో కావేరీ ఉత్తరతీరాన్ని ఉన్న పంచనదం అనే గ్రామంలో ఒక వ్యక్తి తనువు చాలించాడు. అతడి పేరు త్యాగరాజు. అతడింటిపేరు కాకర్లవారు—అని చాలా కాలంవరకూ తెలియలేదు. తెలుగు వాళ్ళకి. అతడి మాతృభాష తెలుగు. అతడు ఒక త్రిలింగ బ్రాహ్మణ కులమువాడు. అతడు వందలాది కీర్తనలూ ఒక నాటకమూ ఒక గేయప్రబంధమూ రచించి తన జీవితం భగవన్నామ సంకీర్తనం చెయ్యడానికి అర్పించాడు. తెలుగు దేశంలో యాభై అరవై ఏళ్ళనించి జరుగుతూ వస్తూన్న పాటకచేరీలనబడే సమావేశాల్లో వినబడుతూండే 'కృతులు'— పాపం, ఆ త్యాగరాజు రాసినవే. అతని శిష్యుల దగ్గిరా ప్రశిష్యుల దగ్గిరా వ్రాతరూపంలో ఉంటూండే కీర్తనలలో ఏకొన్నో ఒకకొన్ని మొదటి పర్యాయం ఎప్పుడు గ్రంథ రూపం దాల్చాయో తెలియదు. నేను చూడగలిగినవి రెండు గ్రంథాలు. ఒకటి 1908 లో 505 కీర్తనలతో ఘృతస్థానం నరసిహ్మభాగవతులు వెయించినది. కీర్తనల్లో ఉండే 'అక్షరములును పదములును శుద్ధములుగా లేకుండుటచే' తను ఆ గ్రంథం అచ్చు వెయించానని ఆయన

రాశారు. కఠిన పద సమాసాలకి అర్థాలు ఇచ్చారు. రెండవ గ్రంథం 1922 లో కీర్తనలతోనే కాక 'ప్రహ్లాద భక్త విజయం' అనే నాటకంతోనూ 'నౌకాచరిత్రం' అనే గేయ కావ్యంతోనూ కూడి ఉంది. ఈ గ్రంథ సంపాదకులు విద్వాన్ కె. వి. శ్రీనివాసఅయ్యంగారు. పాడేవాళ్ళు పాడు చేస్తూంటారుగాని త్యాగరాజు తెలుగు మంచిదే నన్నా రీయన. కీర్తనలకి అకారాది పట్టిక ఇచ్చారు. మేళకర్త రాగ క్రమాన్ని అనుసరించే కీర్తనల పట్టిక మరోటి కూడా ఇచ్చారు. కీర్తనలని, విష్ణు-శివ-మొదలైన శీర్షికల కింద విడదీశారు. త్యాగరాజు పేరు చివర వస్తూండే కీర్తనల్లో అధమం వంద శివ కీర్తనలూ, ప్రహ్లాద భక్తవిజయమూ, నౌకాచరిత్రమూ — అసలు త్యాగరాజు రచనేకాదు పొమ్మన్నారు. 'ఎవరని నిర్ణయించిరిరా' లో ఉన్న 'రా-మ' గురించిన చమత్కారం ఎవరో చేసిన నూతన కల్పనేగాని, త్యాగరాజు అంత 'అసంభావితం' రచించడన్నారు. శివుణ్ణి భాగవత కోటిలో చేర్చేవాడు గనక, త్యాగరాజు శివ కీర్తనల్లో ఏవీ కూడా రాయలేదేమో అన్నారు. లోగడ ప్రచురింపబడ్డ పుస్తకాల్లో 'అక్షరము పొరపాటుగాని శబ్దము పొరపాటుగాని లేక పదికీర్తనము లైనను దొరకుట కష్టముగ నున్నయది. మఱిగొన్ని పుస్తకములలో మొదలు పెట్టి తుదవఱకుఁ దప్పులులేని కీర్తన యొకటైనను లేదు'ట. అట్లాంటి పుస్తకాలు చూడగా బాధకలిగి శుద్ధప్రతి తాను

వేశానన్నారు ఎందుకో అందుకు ఎల్లానో అల్లా కీర్తనలూ అవీ అచ్చుకొట్టేసి ఇద్దరూ ఊరుకుంటే తీరిపోనా, 'శ్రీత్యాగరాజస్వాములవారి చరిత్రము' అనే శీర్షికతో మొదటి ఆయన 12 పేజీలూ, 'శ్రీత్యాగరాజస్వామి చరిత్రము' అనే పేరుతో రెండో ఆయన 21 పేజీలూ ఆక్రమించేటట్టు త్యాగరాజు జీవితాన్ని గురించిన విషయాలు రాశారు.

నరసింహభాగవతులు రాసిన ప్రకారం శ్రీ త్యాగరాజస్వాములవారి చరిత్ర ఇల్లాఉంది: చోళమండలంలో కావేర్యుత్తరతీరాన్ని పంచనదం అనే శివస్థలంలో శాంతగుణాలు గల రామబ్రహ్మం అనే భూసుర శ్రేష్ఠుడు ఉండేవాడు. అతని భార్య శాంత. తనకి పుత్రులు కావాలని రామచంద్రుణ్ణి గురించి తపస్సుచేశాడు. 'రెండు' పుత్రులు కలిగారు. రామబ్రహ్మం ఉంఛవృత్తిలో ఆనందంగా ఉంటూ కుర్రాళ్ళతో కాలం గడిపాడు. వాళ్ళ స్వభావమైన ఆంధ్ర గీర్వాణాలు వాళ్ళకి నేర్పించాడు. పెద్దవాడు జప్యేశం, రెండోవాడు త్యాగరాజు. పెద్దవాడు పెద్దన్నయ్యే. త్యాగరాజస్వామికి మొదణ్ణించీ వైరాగ్యమే. ఆ ఊళ్ళోనే సంగీత విద్వాంసుడుగా ఉంటూన్న వీణ-వెంకటరమణదాసు దగ్గిర త్యాగరాజు సంగీతం నేర్చుగున్నాడు. కొన్నాళ్ళకి రాముణ్ణి 24000 కీర్తనలు రాసి పొగిడేసెయ్యాలనుకుని 'గిరిరాజసుతా' అనే కీర్తన ప్రారంభించాడు. తక్షణం విఘ్నేశ్వరుడు ప్రత్యక్షమై 'కానీ,నీ కోరిక నెరవేరుతుంది' అన్నాడు. త్యాగ

రాజు పంచరత్నాలు రాశాడు. ఈ అబ్బాయి లిద్దరికీ వివాహాలుఅయినాయి, తల్లిదండ్రులు పోయారు. వీళ్ళు వేర్లు పడ్డారు.తన వాటాగా, త్యాగరాజు 'రామ విగ్రహాలు' పుచ్చుగున్నాడు, 'నాలుపై యున్నాడే' అనేది పాడేశాడు. మరి కొన్నాళ్ళకి తనకి గురువు ఎవరేనా ఉండాలనిన్నీ, ఎవరో ఏమిటి నారదుణ్ణే రమ్మనిన్నీ కీర్తనలు పాడేశాడు. ఆపళంగా సన్యాసి వేషంలో నారదు డొచ్చి, 'నీ సంగీత సాహిత్యాలు వినాలని నే వచ్చాను' అని త్యాగరాజుతో అన్నాడు. ఆ వచ్చినవాడు నారదుడే అని త్యాగరాజు ఊహించుకున్నాడు. ఊహించుగుని '(శ్రీ)నారద' 'వరనారద' అనేవి పాడేశాడు. అతడు త్యాగరాజుకి తారకమంత్రం ఉపదేశించాడు. దాంతో ఉప్పొంగిపోయి త్యాగరాజు 'ఎంత భాగ్యమో,' 'ఇదే భాగ్యము' అనేవి పాడేసరికి నారదుడు 'స్వరార్ణవం' అనే పుస్తకం త్యాగరాజు కిచ్చేసి మాయం అయాడు. త్యాగరాజు ఆ పుస్తకం తెగచదివి గొప్పవాడౌతూ సంగీత మహిమ ప్రశంసిస్తూ కీర్తనలు రాశాడు. అక్కణ్ణించి అతడికి శ్రీరామచంద్రుణ్ణి ప్రత్యక్షంగా చూడాలని కాంక్ష పట్టుగుంది. రోజుకి ఒక లక్షా ఎనిమిదివేల రామనామం జపించడం మొదలుపెట్టాడు. ఇల్లా మొత్తం 96 కోట్ల రామనామం చేశాడు. దాంతో రాముడు ఇహా తప్పదనుకుని సపరివారంగా వచ్చి త్యాగరాజుకి కనిపించాడు, రోజూ త్యాగరాజు రామవిగ్రహాల ఎదట పాడి

నై వేద్యం పెట్టి తెర వేసేసి మర్నాడు చూడగా సగం
పాలు తాగబడినట్టూ సగం తాంబూలం నమలబడినట్టూ
కనబడుతూండేది. ఇంత ముష్టెత్తుకునే త్యాగరాజూ
శ్రీరామ నవమికి బ్రాహ్మణ సంతర్పణ చేస్తూండేవాడు.
దుష్టస్వభావుడైన జ్యేష్ఠుడు రామవిగ్రహాలు లాగేస్తేగాని
త్యాగరాజు ఇవన్నీ మానడనుకుని, ఆ విగ్రహాలు లాగేసి
కావేరిలో గిరవాటేశాడు. ఆపళంగా త్యాగరాజు అన్నమూ
నీళ్ళూ మానేసి, అవి కావాలో అని ఓ యాభై కీర్తనల్లో
రాగాలెట్టాడు. రాముడు ఈ ఏడుపుకి హడిలిపోయి, ఆ
విగ్రహాలు ఎక్కడున్నాయో ఆ వయినం త్యాగరాజుతో
స్వప్నంలో చెప్పాడు. త్యాగరాజు వెళ్ళి అవి వెతగ్గా అవే
వచ్చి ఇతడికి దొరుక్కున్నాయి. అవి దొరకగానే, ఓటి
రెండు కీర్తనలు పాడేశాడు. ఎప్పుడో భార్య పోయింది.
‘ఏలిజన్మమున’ ‘తొలి నే జేసిన’ పాడేశాడు. తంజావూరు
రాజు తన సభకి రమ్మని త్యాగరాజుని పిలిచాడు. అందుకు
బదులుగా త్యాగరాజు ‘నిధిచాల సుఖమా’ అంటూ పాడు
కుంటూ కూచున్నాడు గాని, ‘ఆ సభకి నేను వస్తాను, లేక
పోతే, నేను రాను’ అని సమాధానం మాత్రం చెప్పలేదు.
ఆ రాజు బలాత్కరించి త్యాగరాజుని సభకి ఈడుద్దాం అను
కున్నాడు గాని అతడికి ‘కుష్ఠురోగం’ రావాలని అంత
మంచి త్యాగరాజూ శపించాడు. వాడికారోగం రాగా
గోలెడుతూ వచ్చి వాడు త్యాగరాజు కాళ్ళమీద పడగా,

త్యాగరాజు అతడికోసం కుదిర్చాడు. ఇతర పుణ్యక్షేత్రాలు దర్శించే కుతూహలంతో త్యాగరాజు తిరుపతి వెళ్ళినప్పుడు దేవుడికీ తనకీ మధ్య తెరపడింది. 'తెర తియ్యగరాదా' అంటూ మొదలెట్టి త్యాగరాజు నిమ్మళంగా పాడినా, ఆ తెర టపుక్కున తెగిపోయింది. తరవాత కోవూరు అనే గ్రామానికి చెందిన సుందరేశ మొదలి నిష్కారణంగా త్యాగరాజు మహిమ గ్రహించి, అతనికి సొమ్ము ఇవ్వ దలిచి, అతడు పుచ్చుకోడని తెలిసి, పల్లకీలో గ్రామాంతరం వెడుతూన్న ముష్టి త్యాగరాజు పల్లకీలో శిష్యులతో మాత్రం చెప్పి సొమ్ము సంచీ దాచాడు. ఇంతలో దొంగలు అడ్డుపడి పల్లకీ దోచబోగా, రామ లక్ష్మణులు వచ్చి దొంగలకి ప్రత్యక్షమై వాళ్ళతో యుద్ధం చేశారు. ఆ వెనక దొంగలు త్యాగరాజుకి కనిపించి మీరు మా గొప్ప యోధుల్ని నియమించారండీ, వాళ్ళు మమ్మల్ని బాణాల్తో మూకేశారు అన్నారు. త్యాగరాజు వాళ్ళు రామలక్ష్మణులే నర్రా, మీ దొంగతనపు పుణ్యంకొద్దీ మీకు వాళ్ళు కనిపించారు, నాకూడా చూపించండీ, ఈ సొమ్ము పుచ్చుగుని, అంటూ శిష్యులు తన కెరిగించి చూపించిన చాటు సొమ్ము ఇవతలకి తోశాడు. వాళ్ళు వద్దన్నారు. త్యాగరాజు ఆ పల్లకీలోనే కూచుని 'రామ బాణ', 'ఎవరిచ్చిరిర', మొదలైనవి పాడేశాడు. దొంగలు భక్తులుగా మారిపోయారు, పల్లకీ బోయీలుగా కుదిరి

పోయారు. మర్నాడు ప్రయాణంసాగించి వెడుతూంటే, ఓ వూళ్ళో ఓ బ్రాహ్మడి శవం చూశారు. రాత్రి ఆ బ్రాహ్మడూ పెళ్ళామూ దారి మార్గంగా ఆ వూరొచ్చారు. ఊళ్ళోవాళ్ళు పెద్దపులుల భయం మూలంగా వీళ్ళకి తలుపులు తియ్యలేదు. ఆ పెద్దపులులు ఏం చేతోగాని వీళ్ళద్దర్నీ మాత్రం చంపలేదు. ఒక పాడుగుడి ఉంటే, లోపల మకాం చెయ్యడానికి వీలుందేమో చూసి వస్తానని చెప్పి, పెళ్ళాన్నవతల కూచోమని, ఆ బ్రాహ్మడు గుడి గోడ దూకి లోపల పడ్డాడు. ఆ గోడకి చాలా చేరువుగా గుళ్ళో బ్రహ్మాండమైన నుయ్యి తవ్వి సిద్ధంగా ఉంది. ఆ దూకుతో ఆ బ్రాహ్మడు బుడుంగుమని చచ్చి తేలాడు. పెళ్ళాం రాత్రి తెల్లవార్లూ పెద్దపులులని తోలుతూ భర్త వస్తాడని అక్కడే కూచుంది. తెల్లవారేసరికి ఊరిజనం తలుపులు తీసుకుని ఇవతలకొచ్చారు. గుడిలో ప్రవేశించి, బ్రాహ్మణశవాన్ని త్యాగరాజు పల్లకీలో వస్తూండే వేళకి పైకి తీశారు. త్యాగరాజు ముందు అనుమానించాడు, 'వాడు భక్తుడేనా' అని! వాడు చాలా భక్తుడని మెళ్ళో తులసిపూసలవల్ల కనిపెట్టి, త్యాగరాజు 'నా జీవాధారా' పాడాడు. దాంతో ఆ బ్రాహ్మడికి ప్రాణం మళ్ళీరాగా, ఆ చచ్చినవాడు బతికి లేచి, త్యాగరాజుకి ప్రదక్షిణించి, పెళ్ళాంతో తనదార్ని వెళ్ళాడు! ఇల్లాంటి అద్భుతాలు చేసుకుంటూ శ్రీరంగం, మధ్యార్జునక్షేత్రం, నాగపురి,

మొదలైనవి తిరిగి త్యాగరాజు మళ్ళీ పంచనదం జేరుకున్నాడు. కొన్నాళ్ళకి ఓ భక్తుడు కాశీనించి రామేశ్వరం పోతూ, రామ ప్రేరణవల్ల పంచనదంవచ్చి, భగవంతుడే తన్ని పంపించాడని త్యాగరాజుతో చెప్పాడు. ఆ పళంగా త్యాగరాజు దాశరథే అనే కీర్తన పాడాడు. ఇల్లాగే చాలా కీర్తనలూ ప్రహ్లాద విజయమూ నౌకాచరిత్రా రచించాడు. తన ఎనభై ఎనిమిదవఏట 'జ్ఞాన మొసగ రాదా', 'ఇదిసమయము రా' మొదలైన కీర్తనలు రాశాడు. రాముడు ప్రత్యక్షం అయి—సన్యసించు, నేటినించి ఏడోరోజున నీకు నా పదవి ఇస్తాను—అన్నాడు. త్యాగరాజు తన ఇంట్లోనే సన్యసించుకున్నాడు. త్యాగరాజు చచ్చిపోయినప్పుడు అతని కపాలంలోంచి పైకి వెళ్ళిపోయిన తేజస్సుని అక్కడి జనం అంతా చూసి ఆశ్చర్యపడ్డారు. దేవతలు ఆ తేజస్సు తప్పించి పుష్పవృష్టి కురిశారు. త్యాగరాజుకి సమాధి నిర్మించారు.

ఇక విద్వాన్ కె. వి. శ్రీనివాస అయ్యంగారు రాసిన త్యాగరాజ చరిత్రలో సంగతులు చూద్దాం. పై చరిత్రలో ఉన్నట్టు అచ్ఛంగా ఉన్నచోట్ల తగ్గించి, వేరుగా ఉన్నపట్లు వివరిస్తాను. తంజావూరు దాపునఉన్న తిరువారూరులో 1770 సంవత్సర ప్రాంతంలో గిరిరాజకవి అనే త్రిలింగ బ్రాహ్మణుడు ఉండేవాడు. అతనిది ఉంఛవృత్తి, అతనికి అయిదుగురు కొడుకులు. అయిదోవాడు రామబ్రహ్మం అతని భార్య శాంత. వీళ్ళకి కొడుకులు ముగ్గురు.

మూడోవాడు త్యాగరాజు. రామబ్రహ్మం కుంభకోణ సమీపంలో ఉన్న పంచనదం వెళ్ళిపోయాడు. సంగీత విద్వాంసుడైన శొంఠి వెంకటరమణయ్యగారి దగ్గిర త్యాగరాజు గానం నేర్చుకున్నాడు. తన ఆంధ్ర గీర్వాణాల్లోనూ పాండిత్యం సంపాదించాడు. త్యాగరాజు. పద్ధాలుగోఏట తండ్రీ, పదిహేనోఏట తల్లీ పోయారు. త్యాగరాజు ఎప్పుడూ రామవిగ్రహాన్ని పూజిస్తూ ఉండేవాడు. పదహారో యేడొచ్చింది, కంచినించి ఒకాయనవచ్చి, త్యాగరాజుకి రామమంత్రం ఉపదేశించి, ఆ నామం తొంభై ఆరుకోట్లు చెయ్యవలిసిందని కోరాడు. ఆమాట పట్టుకుని త్యాగరాజు ప్రతీరోజూ 22 ఏళ్ళు సూత్రం అల్లాచేసి తన 38 వ సంవత్సరం వచ్చేనాటికి పూర్తిచేశాడు. తక్షణం రామలక్ష్మణులు త్యాగరాజుకి కనపడ్డారు. వెంటనే అతడు అఠాణాలో 'ఏల నీదయ రాదు' అనే కీర్తన అప్రయత్నంగా రచించేశాడు. అదే త్యాగరాజు మొదటి కీర్తన. ఇతర కీర్తనలు కూడా చెయ్యడం మొదలెట్టాడు. పెద్దలంతా ఆ కీర్తనలు మెచ్చి, త్యాగరాజు గానంలో గంధర్వుడనీ, జ్ఞాన వైరాగ్యాల్లో కేవలం నారదుడే అనీ పొగిడారు. ఆయన రోజూ చేసే భజన చూడ్డానికి జనం వచ్చేవారు. మతాంతరాలు అవలంబించిన కొందరు దురభిమానులు అతణ్ణి నిందించారు. దాన్తో వాళ్ళని ఉద్దేశించి కొన్ని కీర్తనలు పాడాడు. కొందరు సంగీత విద్వాంసులు అతణ్ణి నిందించారు.

వాళ్ళమీద మరికొన్ని కీర్తనలు రాశాడు. ఒకనాడు త్యాగ రాజు తలంటుగోపోతూంటే ఒక డొచ్చి త్యాగరాజుని పాడవలిసిందని కోరాడు. త్యాగరాజు నూనెవంటితోనే పాడేశాడు. వచ్చినవాడు, ఒక పుస్తకం త్యాగరాజు కిచ్చి, స్నానం చేసుగుని భోజనానికి వస్తానని వెళ్ళాడు. ఎంత సేపటికీ రాలేదు. త్యాగరాజు ఉపోష్యం ఉన్నాడు. రాత్రి ఆ వచ్చి వెళ్ళినవాడు కలలో కనిపించి తను నారదుణ్ణని చెప్పాడు. భక్తితోకూడిన సంగీతం అభివృద్ధి చెయ్యి అని కూడా ఆజ్ఞాపించాడు. త్యాగరాజు 'శ్రీనారద,' 'వర నారద,' 'స్వర రాగ సుధా,' 'సంగీతశాస్త్ర,' మొదలైనవి పాడేశాడు. మళ్ళీ రాముణ్ణి చూడా లనుకుని 'ఎన్నడు చూతునో' అనేది పాడేశాడు. ఇంకా, భజన మంచిది అన డానికి మరోకొన్ని, భక్తి గొప్పది అనడానికి మరోకొన్ని కీర్తనలు రచించేశాడు. భక్తిరహితుల్ని గురించి విచారిస్తూ వేరే కొన్ని కృతులు చేశాడు. ఇంకా ఏకాదశీ పుణ్య కాలంలో బోలెడు రాశాడు. అప్పట్లో రాముడు తిరువనంత పురంలో గోవిందదాసుకీ, గంగాతీరాన్ని ఉండే రామ దాసుకీ కలల్లో కనపడి, వాళ్ళు వెళ్ళి త్యాగరాజుని కలుసు గోవాలని కోరాడు. వాళ్ళు అల్లాచేశారు. తంజావూరు శరభోజీ రమ్మన్నప్పుడు, 'నిధిచాల' 'కాసిచ్చేడిదే' లాంటివి త్యాగరాజు పాడేశాడు. త్యాగరాజు అన్నలు పాపిష్టిరకం అవడంవల్ల వాళ్ళు దురాలోచనలు మొదలెట్టారు—

'ఈ రామవిగ్రహాలు ఉండడం నించి ఈ త్యాగరాజు ఎక్కడికీ వెళ్ళకొచ్చాడూ, ఇవి గనక లాగేస్తే వీడు ఆర్జనకి ఎక్కడికి పడితే అక్కడికి వెడతాడూ, ఆ ఆర్జన మనం పుచ్చుగోవచ్చూ' అని ఆలోచించుగుని ఆ విగ్రహాలు తస్కరించి కావేరిలో పారేశారు. త్యాగరాజు ఆ దెబ్బతో అదే ఏడుపు అదే ఏడుపు! ఏకరాగాలూ! తెగకీర్తన్లు చేసి పారేశాడు! రామచంద్రుడు ఉండబట్టలేక కల్లోకవపడి, 'నావిగ్రహాలకోసం మరి ఏడవకునాయనా, అవి ఫలానచోట ఉన్నాయి' అని చెప్పేశాడు. విగ్రహాలు దొరకగానే త్యాగరాజు ఇంకా కీర్తనలు పాడేశాడు. తిరపతిలో 'తెరతియ్యగరాదా' పాడేసరికి అడ్డొచ్చిన తెర తెగిపడింది. సుందర మొదలియారూ, సామ్మూ, పల్లకీ, దొంగలూ, పల్లకీలో కూడా 'ముందు వెనుక' అనే పాటా, దొంగల్ని మెచ్చడమూ, వాళ్ళు భక్తులుగా మారి పల్లకీ మొయ్యడమూ, ఇంకోఊరూ బ్రాహ్మణ శవమూ, అక్కడ 'నా జీవాధారా' అనే కీర్తన పాడడమూ, ఆ శవం లేవడమూ— ఇవన్నీ పై పరిచ్ఛేదంలోని కథలో ఉన్నట్టే ఉన్నాయి. ఇక శ్రీరంగం వెళ్ళి నప్పుడు, 'చూతామూ రారే,' 'ఓ రంగశాయీ;' భార్యా వియోగం వచ్చి నప్పుడు 'తొలినేజేసిన' 'తొలి జన్మమున' అనే కీర్తన్లూ పాడాడు! మళ్ళీ చివరకి రాముడు ప్రత్యక్షం అయి 'ఓ త్యాగరాజూ, నువ్వు పదినెలల్లో చచ్చిపోతావ్, నీకు మరోజన్మ ఉంది'

అన్నాడు. త్యాగరాజు రాముడి స్థూలపాదాల మీదపడి, 'క్షీణమై తిరుగ', 'మోక్షముగలదా' 'నీ దయరావలెగాక' లాంటి కీర్తనలు గబగబలాడించేశాడు. ఇల్లా తొమ్మిది నెలల యిరవై రోజులు గడిచిపోయింది. ఇం కోసారి రాముడు కనపడ్డాడు. 'ఇక పదిరోజుల్లో నీమరణం, మళ్ళీ నీకు జన్మ ఉండదు' అని చెప్పేశాడు. త్యాగరాజు 'గిరిపై నెలకున్న' రచించాడు. పరాభవనామ సంవత్సర, పుష్య బహుళ పంచమినాడు త్యాగరాజు అస్తమించాడు. అతని తేజస్సు బుర్రలోంచి పోతూండడం అనేకులు చూచి ఆశ్చర్యపడ్డారు. ఆయనకి కావేరీతీరాన్ని సమాధి కల్పించి, ఒక బృందావనం కట్టారు. అది ఇప్పటికీ ఉంది.

పై రెండు చరిత్రల్లో కూడా కేవలం ఊహామీదా, భావనమీదా, విశ్వాసం మీదా, నమ్మకం మీదా, ఫలితం గొప్పదని తేలిన తరవాత ఆఫలితం సిద్ధించడానికి ఉండి ఉండిన పరిస్థితులు చాలా ఆదర్శపూర్వకంగా ఉండాలనే అపోహామీదా, ఆధారపడ్డ సంగతులున్నా, సాధారణ మానవుల ఇంగితజ్ఞానానికి విరుద్ధంగా తోచే సంగతులున్నా, మినహాయించేస్తే 'చరిత్ర' అనేది విస్తారం కనిపించదు. త్యాగరాజు ఒక అఖండాత్మ! ఆసంగతి నిస్సంశయం. అతని కృతులు పఠించో, లిఖించో, గానంచేసో, అచ్చొత్తించో, వ్యాఖ్యానంచేసో, బోధించో అతని మరణానంతరం వంద ఏళ్ళు నిలబెట్టినవాళ్ళందరూ వందనీయులే! మహానుభావులే!

కాని, వంద ఏళ్ళ కిందటమాత్రమే గతించినవాడి చరిత్రే ఇంత అస్తాయిస్తంగా ఉంటే, ఇంకా పూర్వీకుల చరిత్ర లని చెప్పబడే వాటిల్లో ఎన్నెన్ని అసస్మారాలు ఉంటున్నాయో కదా అని బాధకలుగుతూంటుంది. జరిగిపోయినవి అని చెప్పబడే సంగతులు కొన్ని పోగుచేసి, ఆరచనకి 'చరిత్ర' అని పేరుపెట్టడం చాలా బాధ్యతతో కూడినపని. ఒకవ్యక్తి జీవిత చరిత్ర కూడా అంతటిదే. భక్తుడి చరిత్ర అన్నంత మాత్రాన్ని అది ఏవో కొన్ని మహాద్భుతాలతో కూడి ఉండితీరాలి అనుకోడం న్యాయంలా కనిపించదు. పోనీ, మనం గ్రహించుకోడానికి తాడూ బొంగరమూ లేనప్పుడు ఏ ఊహాలు పన్నినా ఎంత కల్పన చేసినా అనడానికి లేదు. ఆవ్యక్తే బోలెడు గ్రంథం లిఖించి బాదుకట్టుచేసి యిచ్చి వెళ్ళినప్పుడు ఊహాఅవసరంలేదు, అపోహా అక్కర్లేదు. అంతమాత్రాన్ని మాహాత్మ్యాలుగాని, అద్భుతాలుగాని ఉండవని నా అభిప్రాయం కాదు. సాధారణ ఇంగితజ్ఞానానికి గాని, హేతువాదనికి గాని, విచక్షణకిగాని అతీతంగా ఉండే సంభవాలు ఉండగలవు. భూమిమీద ఇతర మానవులతో పాటే కష్టసుఖాలుపడుతూ దేవలోకంతో వ్యవహరించ గల వ్యక్తులు ఉండడం అసంభవంకాదు. ఎల్లా ఉంటాడో మనం ఎరగని దేవుడు అనే వాడు తను మెలుకువగా ఉండగానే తనకి రాత్రి ప్రత్యక్షం అయాడని మనతో ఒకడు చెబు తాడు అనుకోండి. అతడి గుణశీలాల్నిబట్టే అతడి నిజాయితీ

బట్టి అతణ్ణి మనం నమ్మవచ్చునను కోండి. ఆ దృశ్యం అతడి మనస్సుకి యధార్థంగానే కనిపించి ఉండవచ్చు. అంతేగాని దానికి బాహ్యప్రపంచంలో వాస్తవికత లేకపోడంనించి, ఆ వ్యక్తికి తప్ప ఇతరులకి ఆ దృశ్యం గోచరింపకపోవచ్చు. అటువంటి దృశ్యాలు పొందగలవాళ్ళలో సార్థక మహాత్ములే కాక, పిచ్చివాళ్లూ, హిస్టీరియా వాళ్లూ, మూర్ఛలువచ్చేవాళ్లూ, పైత్యం ఎక్కువ ఉన్నవాళ్ళూ, వయస్సు వచ్చినా బాల హృదయం గలవాళ్ళూ, కూడా ఉంటారు. చాలా సందర్భాల్లో ఇటువంటివి యధార్థాలు కావని తేలుతూంటుంది. చెప్పేది భక్తుడి గురించి గనక, ఎవరు ఏది అతణ్ణి గురించి చెప్పినా ఇతరులంతా అది యధార్థం అని స్వీకరించి తీరాలి అంటూ చెప్పినవారే పట్టుపట్టి లాభం లేదు. అటువంటివి చెప్పేవారికి చెప్పడానికి ఉన్నంత హక్కు విన్న వాళ్ళు నమ్మకపోవడానికి కూడా ఉంటుంది. ఇటువంటి తర్జనభర్జన నా అజ్ఞానంవల్ల నేను పడుతూ పై చెప్పిన చరిత్రల్లో నిర్వివాదంగా అంతా స్వీకరించగల సంగతులు మనవి చేస్తాను.

త్యాగరాజు అనే పేరుగల ఒక తెలుగువ్యక్తి 1847 సంవత్సరంలో పంచనదంలో పరమపదించాడు. అతని పుట్టుక 1758. అతని తల్లిదండ్రులు శాంతా రామబ్రహ్మములు. అతని తాత గిరిరాజకవి. గిరిరాజూ, రామబ్రహ్మమూ, త్యాగరాజూ కూడా ఉంఛవృత్తి (యాయవారం) వల్లే బతి

కారు. త్యాగరాజుకి ఒకడో ఇద్దరో సోదరులు. ఆ యిద్దరిలో ఒకడు పోయిఉంటాడు. మిగిలినవాడు జ్యపేశడు (జప్యేశుడు), ఇతడు మంచివాడు కాడు. త్యాగరాజు చిన్నప్పట్నించీ జ్ఞానే. త్యాగరాజుకి సంగీతవిద్యా గురువు శొంఠి వెంకటరమణదాసు. త్యాగరాజు స్వభావఆంధ్రము. అతడు గీర్వాణము కూడా నేర్చాడు. అతడు ఆంధ్రంలోనూ సంస్కృతంలోనూ చాలా కీర్తనలు రాశాడు. తిరుపతి, శ్రీరంగం, నాగపురి, మధ్యార్జునక్షేత్రం — మొదలైన దివ్యస్థలాలు ఆయన వెళ్ళి చూశాడు. భక్తి ప్రాశస్త్యం గురించీ గాన మహిమగురించీ ఆయన కీర్తనలు చేశాడు. కీర్తనలు మాత్రమే కాక 'ప్రహ్లాద భక్తవిజయము' 'నౌకా చరిత్ర' అనే రచనలు కూడా చేశాడు. ముసిలితనం దాకా బతికి చచ్చిపోయాడు.

ఇంతకి దాటించి పై చరిత్రల్లోని అంశాలు సంపూర్ణ యధార్థాలకింద రావేమోనని భయం వేస్తోంది. ఇంకా ఒక కీర్తనేనా రాశాడో లేదో అప్పుడే త్యాగరాజు 24000 కీర్తన్లు — (అది సుప్రసిద్ధ రామాయణ సంఖ్య గదా అని) రాయడానికి సంకల్పించడం!— మొదటి కీర్తన రాయగానే విఘ్నేశ్వరుడు కనిపించడం! తనకి గురువుగా ఉండే నిమిత్తం నారదుణ్ణి రావలిసిందని త్యాగరాజు కోరడం! నారదుడొచ్చి 'స్వరార్ణవం' ఇవ్వడం! అది చదివేసి త్యాగరాజు గాయకుడవడం! అక్షరాలు మిం

గెయ్యకుండా మిక్కిలి వేగంగా రెండు సెకనుల్లో మూడు సార్లు 'శ్రీరామ' అనగలిగినా రోజుకి 20 గంటల చొప్పున ప్రతీరోజూ అవిచ్ఛిన్నంగా 22 సంవత్సరాలు కృషిచేస్తే గాని తెమలని 96 కోట్ల రామనామం మాత్రమే చేస్తూ ఇతర వ్యాసంగమూ నిద్రాహారాలూ లేకుండా త్యాగరాజు కూచోడం! ఎన్నాళ్ళీ యుష్టి ఎత్తనురా, ఎందరి అధములదగ్గర చెయ్యిచాచనురా, నేను పరదేశిని రక్షించరా అని ఏడిచే ముష్టి త్యాగరాజు సంతర్పణ చెయ్యడం! రాముణ్ణే అది వరకు చూసిన త్యాగరాజు, ఆ రాముడి విగ్రహాలే తనకి అందంగా కనపడట్టు ఏడవడం! 'అంతేడు పెందుకు నాయనా, నాకంటె నా విగ్రహాల్నే గొప్పగా చూసుకుంటున్నావు గావును, అయితే అవి ఫలానచోట ఉన్నాయి' అని అతడేవచ్చి కల్లో చెప్పడాన్ని గురించి మరొకరు చెప్పడం! రాజు తన సభకి రమ్మని త్యాగరాజుని పిలవగా, వెళ్ళకపోడం అల్లా ఉండగా, పైపెచ్చు ఇంత భక్తుడూ ఆ రాజుని శపించడం! ఆకలిమీద ఉన్న చేపకి గాలంలాగ, స్వచ్ఛమైన దీపానికి మరుగులాగ, మనసారా భోజనం చేసేటప్పుడు ఈగలాగ, దేవుణ్ణి ధ్యానం చేసేటప్పుడు మనస్సు అపవిత్రపు చోటుకి వెళ్ళడంలాగ, నా పురుషార్థాలన్నీ నన్నూ వేరుచేసే మాత్సర్యం అనేది నా అంతర్యంలో ఉంది, తీసెయ్ వెంకటరమణా అని త్యాగరాజు పన్నిన రచనలోంచి, తనకీ దేవుడికీ మధ్య ఉండే

బట్టతెర తెగడం అనే అర్థం లాగడం! రామలక్ష్మణులు దొంగలు చేసుగున్న పుణ్యాం చొప్పున వాళ్ళకి కనపడడం! రామలక్ష్మణుల్ని చూపించే మరతుకి, దొంగలకి పల్లకీలోని చాటు సొమ్ము లంచం ఇవ్వడానికి త్యాగరాజు యత్నించడం! త్యాగరాజు పల్లకీలోనే కీర్తనలు రచించడం! అదేదో ఊళ్ళో పెద్దపులులు రాత్రివేళ ఊరివాళ్ళని తప్ప తక్కిన ఒక బ్రాహ్మణ్ణే అతని పెళ్ళాన్ని చంపకుండా ఊరుకోడం! దేవాలయపు సరిహద్దు గోడకి ఆనుకుని పెద్దబాపి నోరు తెరుచుగుని ఉండడం! తెల్లవార్లూ కిమ్మనకుండా ఒక ఆడ కూతురు పెద్దపులులని తోలుతూ ఒక రాత్రి కూచోడం! శవం భక్తుడిదో కాదో అని త్యాగరాజు తటపటాయించడం! తన జీవానికి ఆధారం, తన తపస్సుకి ఫలం, తన దృష్టికి ప్రకాశం, తన నాసకి పరిమళం, తన జపానికి వర్ణరూపం, తన పూజకి సుమం. అని తన దైవాన్ని త్యాగరాజుతల్చుకో గానే, శవం లేవడం!—'ఈ శవాన్ని లేవదియ్యవోయ్ రామా' అని గాని, 'ఓసి శవం, లేవవే' అని గాని త్యాగ రాజు కోరకుండానే!

'ఏల నీదయరాదు' అనేది త్యాగరాజు మొదట్లోనే రచించడం! పెద్దలంతా త్యాగరాజు తొలికీర్తనలు మెచ్చడం! తల్లిదండ్రులు తప్ప తక్కిన వాళ్ళంతా నన్ను హింసించారు మహాప్రభో అని త్యాగరాజు గోలెడుతూంటే, కొందరు మతాంతరులు మాత్రం త్యాగరాజుని నిందించారనడం!

ప్రతీపనికీ రాముడు కలలో కనిపించడం! పదినెలలకి త్యాగరాజు పోతాడన్నప్పుడూ, పదిరోజులకి పోతాడనగానూ రాముడు కనిపించి హెచ్చరికలు ఇస్తూండడం! త్యాగరాజు మరణించగానే కపాలం పగిలి అందులోంచి తేజస్సు బయల్దేరి పోతూండడం అనే సంగతి చాలామంది చూడడం!

—మొదలైన సంగతులు నమ్మేవారు ఉండవచ్చు, నమ్మనివాళ్ళు ఉండవచ్చు. ప్రస్తుతం ఏరీతిగానూ కూడా అవి ఋజువు చెయ్యడానికి వీల్లేదు గనక, అవన్నీ గాని వాటిలో కొన్నింటిని గాని నమ్మేవాళ్ళని మనం కోప్పడకూడదు, నమ్మని వాళ్ళని తిట్టకూడదు. కేవలం అభూత కల్పనలు బయల్దేరడానికి కారణాలు ఉండవచ్చును. కొందరు,—"త్యాగరాజు వెనక ముష్టెత్తుకునేవాడు, అప్పట్లో మనం అతడికి ఏమీ సాయం చెయ్యలేకపోయాం, పోనీ ఇప్పుడు అతనికి మనం కొన్ని వీసాల మాహాత్మ్యమూ దివ్యత్వమూ తగిలిస్తే తీరిపోతుంది" అనుకుని గొప్పను కల్పనలు చేసి ఉంటారు. ఇప్పుడు మన కళ్ళముందు ఎంతమంది వ్యాపారం చేసుకోడంలేదూ! వాళ్ళల్లో ఎంత మంది దగ్గిర ఏం ఏం మాహాత్మ్యాలు కనిపెట్టాం—అందులో మన భాష కాని భాషవాళ్ళదగ్గిరా! మరికొందరు—ప్రతీ కీర్తనకీ ఏదో పూర్వసందర్భం జరిగి ఉండాలి. ఏం జరిగిందో అసలు వాడు చెప్పలేదు. ఆలోటు మనం పూడ్చి, ఏదేనా కీర్తనలో ముక్క ఒకటో లేక రెండు ముక్కలో ఆధారం

చేసుగుని ఆ చుట్టూ ఒక ప్రశస్తమైన మాటల అల్లిక చేసేస్తే, ఆంధ్రలోకం, స్వీకరించేస్తారు, స్వీకరించిన సరుకు ఎంత చెత్తరకం అయితే అంత గట్టిగా పట్టుగుంటారు" అని గావును కళ్లెంలేని రెక్కల గుర్రాలమీద ఊహాకాశంలో విహారాలు చేస్తూనే పునాదిలేని గాలిమేడలు కట్టేశారు వేరేకొందరు మహానుభావులు— "త్యాగరాజు చిరకాలంపాటు మరోపని ఏదీ చూడకుండా రామనామం మాత్రం జపిస్తూనో లిఖిస్తూనో కూచుండగా, కొన్ని ఏళ్ళయే సరికి రామనామం బరువెక్కిపోయి రాముడికి తగిలి అతడు సపరివారంగావచ్చి త్యాగరాజుకి కనబడి, "నువ్వు కృతులు రాసి భక్తితో కూడినగానం ఎక్కువ చెయ్యి, ముష్టి మాత్రం ఎత్తుగో, అందుకు మేం ఏమీ చెయ్యలేము" అని చెప్పగా, ప్రారంభంలోనే అఖండమైన కీర్తన రచించడమూ, ఆ దెబ్బతో ఒక రాముడన్న మాటేమిటి, విఘ్నేశ్వరుడు, కుమారస్వామి, హనుమంతుడు, నారదుడు లాంటివాళ్ళు కలల్లోనూ ఒక్కప్పుడూకూడా త్యాగరాజుకీ ఇతరులకీ కూడా కనిపిస్తూండి మాట్లాడుతూండి అతనిచేత దివ్యమైన కృతులు రాయించారు అని చెబితే, మానవ కృషియందు ఎంత మాత్రమూ విశ్వాసంలేని ఆంధ్ర మహాభక్తులు కిక్కురు మనకుండా నమ్ముతారు గదా అనే ధైర్యంకొద్దీ వ్యవహరించి ఉంటారు. ఏమైతేం, వాటివల్ల వృద్ధిఅయిన త్యాగరాజు చరిత్ర కనిపించదు.

త్యాగరాజు ఒక కీర్తనలో "కాలము బోను మాట నిలుచును" అన్నాడు. అల్లాగా అతని కీర్తనలు అయి దారు వందలు పైగానూ, అతని కావ్యాలూ నిల్చి ఉన్నాయిగదా! అతని చరిత్ర తెలుసుకోడానికి అవే దిక్కని అనుకుందాం. ఇందులో కొన్ని అతను రచించినవి కావేమో అనే భయం మనకి వద్దు. త్యాగరాజు అనేవా డుండడం రూఢికదా, మరో పేరుమాసినవాడి శోభ మన కెందుకూ! ఇక్కడికి త్యాగరాజ కీర్తనల సంపుటాలూ, అతని చరిత్రలూ, వాటిలోని సంభవాసంభవనీయ విష యాలూ, అందుకు కారణాలూ గమనించాం. మరి ప్రకృతం.

కీర్తనలూ, ప్రహ్లాద భక్తవిజయమూ, నౌకాచరిత్రా, శిష్యులు ప్రకటించిన స్తోత్రశ్లోకాలూ పద్యాలూ కలిపిన సంపుటం పైకొచ్చేదాకా, త్యాగరాజింటిపేరు 'కాకర్ల' అనే సంగతీ ఖాయపడలేదు, త్యాగరాజు ప్రమేయం వచ్చి నప్పుడల్లా, అతని నోటంట గాని, శిష్యుల నోటంట గాని, 'త్యాగరాజు' అనే వచ్చింది గాని త్యాగయ్య అని ఎక్కడా మచ్చుకేనా రాలేదు అనే విషయమూ రూఢికాలేదు. కీర్తనలు వచ్చాయీ అంటే సరా, వాటి కెన్ని మారా మతుళ్ళూ! కీర్తనలకి స్వతస్సిద్ధంగానే కొన్ని చిక్కు లున్నాయి. 'కీర్తన' అంటే మాటల్లోనే ఉంటుంది గాని, ఆ మాటలు గద్యమూ కాదు, పద్యమూ కాదు—మాత్రల

లెఖ్ఖప్రకారం నడిచే మాటల సముదాయం. అది మూడు భాగాలు—పల్లవి, అనుపల్లవి, చరణం. ఒక హృదయ పూర్వక భావాన్ని సూచించే వాక్యంలోని మాటలు గలది పల్లవి. ఆ మాటలు ఒకసారి కాదు వెన్వెంటనే కూడా ఎన్నిసార్లు అనగలవారు అన్నా, భావంలో నూతనత్వం చిగిరిస్తూనే ఉంటుంది నిజంగా. అనుపల్లవి ఆ భావాన్నే పై స్థాయిలో పూర్తి చేస్తుంది. చరణం చివరకి నడుస్తుంది. అది పై భావాన్ని వివరిస్తుంది, ఉపహరిస్తుంది, బల పరుస్తుంది, వ్యాఖ్యానిస్తుంది. చరణాలు ఎన్నైనా ఉంటాయి. సరే. కీర్తన కేవల శబ్దప్రమేయం కాదు, స్వరప్రమేయం కూడానూ. అందువల్ల, మాటల భావం సూచించే అవస్థకి అనుగుణంగా ఉండే రాగం ఒకటి నడుస్తూంటుంది. వీటిని జతపరచడంలో ఉండే ఆనుకూల్యం గమనించిన తరవాతే, కీర్తన కర్త ఆ రాగం ఈ ముక్కలు అనడాన్ని గురించి సూచిస్తాడు. ఆ రాగంలోని సంగతులే ఆ మాటల్లో ఉన్న సంగతిని పెంపొందింప చెయ్యడానికి మిక్కిలి ఎక్కువ వీలని అతని ఉద్దేశం. కాని, అత డెంత సూచించినా, ఆ మాటలు అతని వైనట్టు, ఆ రాగం అతనిది కాజాలదు. ఆ గానం కేవలం కీర్తనని ప్రకటించడానికి కూచున్న ఆసామీ యొక్క గాత్రానిదే అయిఉంటుంది. ఇది కీర్తన యొక్క రెండో చిక్కు. ఈ చిక్కువల్ల బోధపడేది ఏమిటంటే కీర్తన ద్వ్యర్థి కావ్యం. ప్రతిపాదంలోనూ యతీ, చివరంటా

ప్రాసయతీ, మాత్రల లెఖ్ఖ ఉండడం నించి గద్యం కంటె గొప్పదీ, గనక ఒక రకం కవిత్వం రాగతాళాలు ఉండడం నించి గానం. అనగా, పదస్వర సమ్మేళనం. సార్థక కీర్తన కర్తని కవులూ గాయకులూ కూడా మన్నించాలి. సాధారణంగా కీర్తనకర్తని కవులు — 'వారి గానం చాలా గొప్పది' అనీ, గాయకులు — 'వారి కవిత్వం చాలా గొప్పది' అనీ మెచ్చడం నేను విన్నాను. పర్యవసానం ఏమిటంటే, కీర్తనకర్త ఎంత అఖండుడైనా అతడిది ఎప్పుడూ త్రిశంకుస్థితే. అతణ్ణి కవులు కవి అనీ ఒప్పుగోరు, గాయకులు గాయకుడనీ అంగీకరించరు. ఈ సందర్భంలో మరో సంగతి. ప్రతీ కీర్తనకర్తా నేటికాలంలో మనం చూస్తూన్న పాటకచేరీలు లాంటివిచేసీ, మహాజనుల్ని మెప్పించేటట్టు గానం తియ్యగలవాడని మనం అనే సుగుని ఊరుకోకూడదు. నేను కొందరు మంచి కీర్తన కర్తల్నీ, గానసాధనకి వర్ణాలు రచించిన వాళ్ళనీ ఎరుగుదును. వారి పాట జనాన్ని ఆకర్షించేది కాదు. వాళ్ళు మేం పాడతాం కూచోండి అని జనాన్ని కోరితే, జనం మాకు పనుంది పోతాం అనేవాళ్ళు. అది కీర్తన కర్తకి మంచి గాత్రం లేనప్పటి అవస్థ. ఒకవేళ ఆకీర్తన కర్తే పాడి కూడా జనాన్ని ఆకర్షిస్తాడందాం. అయితేం ? ఏడుపుగాళ్ళు ఎప్పుడు లేరు ? ఎప్పుడు ఉండరు ? తన పనిసంగతి తనకి అఖ్ఖర్లేక, పక్కవాడు ఏ ఒక పనిచేసినా ఏడిచేవాళ్ళు ఎందరో మహానుు

భావులు! ఆ పక్కవాడికి ఆ ఒక పని ఫలించడం కూడా
జరిగిందనుకోండి. దాంతో మరి గోలెత్తిపోయే వాళ్ళున్నారు.
ఆ పక్కవాడు రెండు పన్లల్లో కృషి చేస్తూంటాడనుకోండి.
అందుగురించి కక్కటిల్లి వెక్కి వెక్కి వాపోయే వాళ్ళుం
టారు. ఒకవేళ కర్మం జాలక, ఆ రెండు పన్లల్లోనూ కూడా
ఆపక్కవాడు విజయం సాధించాడనుకోండి. ఆ దెబ్బతో
గుక్కతిరక్క మతోయి మాటపోయి మూర్ఛిల్లిపోయే
సరుకూ ఉంటారు. కీర్తనకి కీర్తిరాగానే ఈ చివరరకం జనం
కుక్కగొడుగులులాగ బయల్దేరతారు. అందులో కీర్తనలోని
మాటల భాష పరాయిభాషగా ఉండేచోట ఆ కీర్తన
విజృంభించేటట్టు కనిపిస్తే, అది సహించలేక, అన్నం నీళ్ళూ
మానుకుంటూ పైకి మాత్రం హితవు మాటలు చెబుతూ
మొహంలో ఏడుపు పైకి పొక్కకుండా దిగమింగుకోడానికి
సకల తిప్పలూ పడేవాళ్ళు ఉంటారు. త్యాగరాజుకి అల్లాంటి
వాళ్ళు చాలామందే ఉండి ఉన్నారు. తెలుగుసీమ కాని
చోట త్యాగరాజు పడ్డా, ఏడుపుగాళ్ళు అతడికి అక్కడా
తప్పలేదు. కీర్తన యొక్క మరో చిక్కు ఏమిటంటే, చాలా
మందికి కీర్తన తాలూకు మొదటి ముక్కలూ అంకితమూ,
మాత్రమే గుర్తు. మరికొందరు అదృష్టవంతులికి అది ఏ రాగం
మీదో దాని పేరు మాత్రం ఎక్కువ జ్ఞాపకం. అనగా,
కీర్తనలు పాడే వాళ్ళల్లో కొందరికీ, వినేవాళ్ళందరికీ, కీర్తన
ఆద్యంతాలు మాత్రం తెలుసు. మధ్య ఉండగల పదార్థం

గాని పరమార్థంగాని అంత అవసరం అయిన భాగంలా కనపడదు. కీర్తన ఆచరించే వారిలో కొందరుకూడా ఒకటి కంటె ఎక్కువగా చరణాలు కీర్తనలో ఉంటే, అంకితం అనగా త్యాగరాజు పేరు సందర్భించే చరణాం మాత్రం పాఠం చేస్తారుగాని, తక్కినవి చెయ్యరు. కొందరు 'ఇంకా చరణాలున్నాయా, ఎందుకూ?' అంటారు. ఒక కీర్తన ఒక వాగ్గేయకారకుడి ఉత్కృష్టమానసిక ఆందోళనకి సూచన. అది యావత్తూ ఆచరణలో పెట్టినప్పుడు గాని కర్తయొక్క మానసికావస్థవంటిది ఆచరించేవాడికి సిద్ధించదు. ఆచరించే వాడికి లేని మానసికావస్థ శ్రోతల్లో కలుగుతుందని అను కోడం, భ్రమ. త్యాగరాజు యొక్క అన్నివందల కీర్తన ల్లోనూ కొన్నిమాత్రమే ఆంధ్ర జనంలో ఒక భాగానికి పరి చయం అయినా, ఆ పరిచయం కీర్తన మొదటి ముక్కలూ, చివరవచ్చే 'త్యాగరాజనుత', ఇంకా వీలైతే తీరుబడిగా ఉంటే ఆ రాగమూ! అంతే. పోనీ ఈ కాసిని ముక్కలేనా ఆంధ్రుల్లో విద్యాధికులికి పరిచయం అయినాయికదా అని 'సంతోషిద్దాం అంటే మనోటొచ్చింది పులిమీద పుట్ర. పాటక చేరీలనబడే వాటిల్లో ప్రథమంలో త్యాగరాజు కీర్తనలు పట్టుగొచ్చి ఆచరణలో పెట్టినవాళ్ళు ఆంధ్రేతరులు. వాళ్ళని ఏమనం? దణ్ణంపెట్టి ఊరుకోవాలిగాని! వాళ్ళ పుణ్యమా అని, ఆముక్కల మీద వాళ్ళుమక్కువ సంగతి దేవుడికి తెలుసు, తమరి అభ్యాస సాధకాలకి ఆముక్కలు

అవసరం అయిఉండడంవల్ల, అవి మాటపట్టుగుని తమ గాత్రం ఆర్జించుకోగలిగిన స్వరసంపద ప్రదర్శించి, ఆంధ్రుల్ని తమవారి కంటె ఎక్కువగా వాటితో మెప్పించుతున్నారు, నేటివరకూ! త్యాగరాజు తన కీర్తనలన్నీ పాటకచేరీల లోనే పాడమన్నాడనిన్నీ, త్యాగరాజు మాటలు పట్టు గుని కీర్తన ఆచరించే అభ్బిమకి ప్రసాదించే నాదారార్భా టం యావత్తూ త్యాగరాజు రచించిన గానమే అనిన్నీ, కర్ణాటగానం అంటే త్యాగరాజు రచించిన తెలుగు మాటలకి ఆంధ్రేతరులు జోడించిన గాన సౌరభ్యమనిన్నీ అనుకోగలిగిన మనస్థితి ఆంధ్రులికి అబ్బింది గానశాస్త్రం తెలిసి గాత్రధర్మం బాగుండి తెలుగు కీర్తన ఆచరించ డానికి, తెలుగు తెలియక్ఖర్లేదని వెల్లడయి పోయింది. అసలే తాళగౌరవం దక్కించేటందుకు సాధారణంగా మాటల యొక్క సంధులు విరగ్గొట్టడం, గురువుని చిన్న పరచడం, లఘువుని గొప్పచెయ్యడం మొదలైనవి కీర్తన ఆచరించే వాడి నిత్యకర్మలు. వాట్లకితోడు భాష కూడా పరాయిదైతే అడిగాయా! సాధారణంగా కీర్తన ఆచరించే వాడి నోటంట వచ్చేమాటలు, అదివరకే మనకి తెలిసి ఉండాలిగాని, క్రొత్తవైతే బోధపడవ్, అన్వయం కావు. అక్కడికీ ఆ ముక్కలు అతడు మళ్ళీ మళ్ళీ బోలెడుసార్లు అంటాడు అన్నా ఆ ముక్కల గతీ అంతే. మనస్థితీ అంతే. 'ఏమిటయ్యా. ఆ మాట్లాడుతూన్నదీ?' అని

అడగడానికి, అది సభగనక వీల్లేదాయిరి — తనకీ నామర్దాయే, కీర్తన ఆచరించేవాళికీ ఒక్కొక్కప్పుడు అగౌరవమే. అందుకని అటువంటి సమయాల్లో చాలమంది శ్రోతలు కూనీఅయిపోయి, తమ అజ్ఞానం ఎక్కడ వీధిని పడుతుందో అని హడిలిపోయి, అర్థాలు కలిగి ఉన్నా అప్పట్లో మనకి బోధపడని మాటలున్నా అర్థాలు ఏమిటో మనకిగాని మానవులకిగాని తెలియక్కర్లేని గానశాస్త్రం లోని సాముగారడీ వైచిత్ర్యాలున్నా ఆలకిస్తూ, మెచ్చు గోడం నేర్చుకున్నారు, మాటలకి అర్థాలు తెలియకుండా వాట్లకి జోడింపుగా వంగ ఆంగ్ల పారశీక మొదలైన ఆంధ్రేతర నాదాలు సంపుటిచేసి, తెలుగు కీర్తనలు పాడ డమూ, విని మెచ్చుగోడమూ ఆంధ్రంలో ఒక నవీన కళగా ఏర్పడిందేమో అని కూడా అనచ్చు. మాటలు ఖైమాఅయినా సరే మంచి పీకవాడో స్వరాలు మాట్లాడే వాడో కీర్తన ఆచరించినప్పుడు ఆనందించగల శ్రోతలూ, కర్తేవచ్చి కీర్తన అనడం తటస్థిస్తే అతనిగానం చూలుగులా ఉన్నా పాలికేకలు లాఉన్నా మెచ్చగల శ్రోతలు బయల్దే రారు. ఇటువంటి శ్రోతలు కేవల గానసభలు అనబడే వాటిల్లోనే కాక, సంగీత నాటక సభల్లోనూ, పద్యపఠన సభల్లోనూ, కొండొకచో, ఉపన్యాస సభల్లోనూ కుడా దొరుకుతారు. మాటలు తమరికి ఎంత మాత్రమూ బోధ పడనప్పుడే, కీర్తన అయేది, పద్యం అయేది, గద్యం

అయేది మెచ్చుకోవాలని, వాళ్ళ మతం. క్రియముక్త కీర్తనలోని మాటలవల్ల జరించగల అవస్థ శ్రోతలకి స్వప్న వృత్తాంతం అయిపోయింది. ఇక, కీర్తన ఆచరించే వారిలో మాటల అర్థనిర్ణయం చేసుకుని తాళభంగం రానీకుండా అర్థస్ఫురణ చెయ్యడానికి తంటాలు పడేవాళ్ళు చాలా తక్కువ. అట్టివాళ్ళు ఆంధ్రుల్లో కంటె ఆంధ్రేతరుల్లో నే ఎక్కువ ఉన్నారేమో అనాలి. పండితులకి కీర్తనలు అక్కర్లేదు. కొందరు పండితుల ఉద్దేశంలో తెలుగులో కవిత్వమే లేదు. వాళ్ళు తెలుగులో ఉన్న మహాకావ్యాలే చప్పరించే తెలుగువాళ్ళు వాళ్ళు పదకవితని ఏమన్నారో ఎరుగుదుం. అందులో త్యాగరాజు, తెలుగు సీమలో లేని వాడు. అతడి కీర్తనల మాటల్లో ఏమంత కవిత్వం ఉంటుం దని వాళ్ళు చూస్తారూ! అదీకాక, త్యాగరాజు రచన నిండా శబ్ద, సమాస, తదితర వ్యాకరణ దోషాలు. చివరకి ఏమిటంటే, త్యాగరాజు వందలకొలది కీర్తనలు రచించినా, పాటకచేరీలలో అరుదునిగా వినబడే కీర్తనలు తప్ప ఇతర కీర్తనలో అతడు ఏమన్నాడో తెలియకుండా నేటివరకూ అస్మదాదులైన ఆంధ్రులు ఉండి పోయారు. తెలియచెప్పడానికి తాఖతుగలవాళ్ళ ఉపేక్షవల్ల, ఈ పరిస్థితి ఏర్పడి ఉంటుంది.

కీర్తన సభాముఖాన్ని వెలువరించడానికి దానికి సూచించబడ్డ రాగతాళాచరణ చేసేవాడే అర్హుడు. తక్కిన వాళ్లైన

నాబోటివాళ్లు అనర్థాలు అని నాభయం. కాని, కీర్తన
లతోనూ ద్విపదలతోనూ పద్యాలతోనూ నిండి ఉన్న
ప్రహ్లాద భక్తవిజయనాటకం యొక్క ఫలశ్రుతిలో త్యాగ
రాజు ఇల్లా అన్నాడు :

శ్రీరామ బ్రహ్మ తనయ త్యాగరాజేన నిర్మితం
ప్రహ్లాద భక్తవిజయ ప్రబంధ భుక్తిముక్తిదం
యేగాయంతి సదా భక్త్యా యేశృణ్వంతి చ శ్రద్ధయా
యేపఠంతి సదా ప్రీత్యా తేషాం సర్వాఘ నాశనం.

కాబట్టి, అతడు పఠనం నిషేధించలేదు. తాత్కాలికంగా
త్యాగరాజు సూచించిన రాగతాళాల వయినం అల్లా ఉంచి,
గద్య పద్య గేయాలు అన్నీకూడా సంపూర్ణ వాక్యాల్లోనే
ఉంటాయి గనక, అతని రచన పఠించి చూస్తే, అతని జీవి
తాన్నిగురించీ అతని గుణశీలాల్ని గురించీ చిత్రవిచిత్రంగా
ఉండే అభిప్రాయాలు పుడతాయి :

ఓమనగుంటలు, రామకష్టాలు, కొండెచిల్లగింజలు చాప
రాయి, ఉడతభక్తి. ప్రొద్దుగూకులు, గచ్చుముండ్లు, కడుపు
పల్లం నింపుకొనడం, నెలకు మూడువానలు కురియడం,
తలతో నడిచి పని చెయ్యడం, అడబోయిన తీర్థమెదురవడం.
నా దుఃఖం ఇల్లా పేలాలు వేగుతూన్నదేమి, ముప్పది రెండు
లక్షణములు గల శ్రీరాముడు, కారానికి ప్రతిగా జీలకర్రా
దిభిభే నుండు దీపం, పాలుగారే మొహం, మన బంగారం

వన్నది కాకపోతే బచ్చుని తిట్టడం ఎందుకు? వెన్న ఉండగా నేతికై వ్యసనం ఎందుకు, అన్న ముండగా జొన్నఅంబలి యేల, స్వధనం ఉన్నవాడు పంచాంగం పట్టుగోడం అవసరం ఏమిటి, విఘ్నేశ్వరుణ్ణి చెయ్యబోతే కోతి అయింది, ఎద్దుకేం తెలుస్తుంది అటుకులరుచి, జేనెడుదరము నింపుట, పూలమ్మిన చోట పుల్లలమ్మడం, ఆదుకొందువో ఆదుకొనవో, దుగ్ధ తీరుతుందా, పూసలు గుచ్చిన రీతిగ, సాధించాడే అబద్ధా లాడి తను పట్టిన పట్టూ! భాండం అంతా చూడాలా మెతుకుపట్టి చూస్తే చాలుగా, ఉప్పు మొదలు కర్పూరం వరకూ ఉంఛవృత్తి, గంగరావికి మొక్కితే రక్షిస్తుందా, చలమలూరడం, ఆజ్యప్రవాహంతో భోజనం, చేరడేసి కళ్ళు, ఇదే పదివేలు, కొంపలుముంచడం, వేయివన్నె బంగారం, గడిదేరడం, చిటుక్కుమంటే అపరాధం, ఈరేడు లోకాలు, ఆడుకోడం (తిట్టడం అర్థంలో, కమ్మగా ఒక మాట, పానకంలో పుడకలాగ, కొన్నసతి (అనగా భార్య— తెలుగు దేశంలోని కొన్ని కాకర్లకుటుంబాలలో ఇదే అర్థం), వర్జసమయము (రాహుకాలము అని ఉండవలిసినచోట, 'వర్జ' శబ్ద మెట్లు తెలిసిందీ?) మొదలైనవి అప్రయత్నంగా సార్థకంగా అనగలిగినంత తెలుగుతనం ఉన్న కాకర్ల త్యాగ రాజు పంచనదంలో ఎల్లా వెలిశాడూ! అతడు అక్కడికి వెళ్ళినవాడా అక్కడివాడా? ఒకవేళ వాళ్ళ నాన్నగారి అటువెళ్ళాడా? వాళ్ళతాతే అటు వెళ్ళిఉంటే, తెలుగుతనం

అనేది పరభాష విజృంభించి ఉన్న ఆ చోట, మనమికి
దాకా ఇంత మిగులుతుందా? త్యాగరాజు దౌహిత్రుడికి
తెలుగురాదటనే! 'మురిపెము గలిగెగదా' లోనూ, 'విధి
శక్రాదులకు దొరకునా' లోనూ పంచనదాన్ని దేవతల్ని
పొగిడినవాడు, 'తొలి నే జేసిన' లో తన పొరుగువాళ్ళు
ఉపరపోషకులనీ తను హరిదాస రహితపురములో వెయ్య
బడ్డాడనీ ఏడుస్తాడేం? 'దండము బెట్టెదరా' లో ఊరివారు
వీధివారు ఒక్కజాతివారు కారు నారిని చెయిబట్టి బ్రోవుము'
అని గోలపెడతాడేం? 'శ్రీపతే' లోనూ, 'దశరథనందన'
లోనూ ఇంకా కొన్ని చోట్లా తను పరదేశినంటాడేం? ఈ
పరదేశి ప్రమేయం ప్రహ్లాదల్లో కూడా వస్తుందేం? 'జాతి
కొకరు కూడిరారము—ప్రీతిచేత తెలుసుకొంటిని నామ
సారము' అని 'శ్రీరామదాస దాసోహం' లో అంటాడేం?
తను తన భావనలో అనుభవించిన దైవం యొక్క నామ
రూపాలూ గుణాలూ విరివిగా వర్ణించినవాడు, మళ్ళీ ఆ
దేవుడే నిరుపాధికుడు అంటాడేం? శివ కీర్తనలలో 'శివ'
శబ్దం వాడినట్లు 'విష్ణుకీర్తనలు' అనబడే వాటిలో
నారాయణుణ్ణి శ్రీశ, శ్రీపతి, శ్రీకాంతుడు, మావరుడు, మారమ
ణుడు, సనకనుతుడు, మునినుతుడు, విధాతజనకుడు, మారజన
కుడు గంగాజనకుడు—మొదలైన వాట్లతో చెబుతాడు
గాని, ఎక్కడా ఒక్క కీర్తనలో నైనా కేటాయింపుగా 'విష్ణు'
శబ్దమే లేదే! 'కొనియాడెడి' 'కట్టుజేసినావు' లోనూ వింత

వింతగా మట్టు మితము లేనట్టి దేవతామతాల్లో జొరబడలేనం
టాడేమి ? 'సుఖి యెవరో' లో దైవ భేదం వద్దంటాడేం ?
'ఎందుండి', సిగ్గుమాలి', 'మనస శ్రీరామ', 'నిజమర్మములను'
'భక్తి బిచ్చమియ్యవే', 'ముమ్మూర్తులు గుమిగూడి' లోనూ
మనం అనుకునే మతాలకి పైమాటలా ఉన్నాడే త్యాగ
రాజు ! తనగోలంతా 'త్యాగరాజ నుతు' డిత్తో చెప్పాడే
అత డెవడు ? 'శ్రీరామ రామాశ్రితులము గామా' లో
మితదృష్టిగల మతాన్ని చప్పరించేశాడే! 'ఇంత తామసమైతే'
లోనూ 'ఏ తావునరా' లోనూ తన దేవుడు ఎక్కడున్నాడో
సందేహిస్తాడేం ? 'భజనపరుల కేలగల్గు' లోనూ, 'ఎంత
వేడుకొందు' లోనూ కోదండపాణి ముఖం హృదయంలో
చూసుకుంటేచాలు, అదే సౌఖ్యం అనేవాడు, రామవిగ్ర
హాలు పోగానే చాలా గోలెత్తిపోవడం ఎల్లా ? 'రామా
నీయెడ' లో తన సౌఖ్యము తా నెరుగక ఒరులకు తగుబోధన
సుఖమా అన్నవాడు, 'మనవిని వినుమా' లో పరులకు
హితమగు భావనగాని చెరచు మార్గముల చింతింప లేను—
అంటా డేమిటి ? 'ఎటుల గాపాడుదువో', 'దుడుకుగల',
'గురు లేక', 'నెనరుంచినాను', 'పాహికల్యాణ' మొదలైన
కీర్తనలలో 'దార' వచ్చిన చోటల్లా 'సుతులు' అని
వస్తూంటుంది, అతనికి కొడుకులు లేరంటా రేం ? అదీ కాక,
'నన్ను బ్రోవ నీకింత' లో—నువ్వు కొడుకుల్ని కనిపెంచ

లేదా—అంటాడే రాముడితో! కొడుకులు లేనివాడు అనవలసిన మాటేనా ఇదీ!

ఎటుల కాపాడుదువో, దుడుకుగల నన్నే దొరకొడుకు, ఎటులబ్రోతువో, ఎన్నాళ్ళు తిరిగెదిది, నేనెందు, సిగ్గు మాలి, మరచెడివాడనా, ఈవఱకు ఆడినవి, పలుకవేమి, కరుణాసముద్ర, ఒరులనాడుకో, నోరేమి, ఎందుకో నీమనసు, ప్రొద్దుపొయ్యేను, అపరాధముల, నిన్నే నెరనమ్మి నాను, భవసన్నుత, నిన్ననవలసినదేమి, కన్నతల్లినీవు, కర్మమే, దర్శనము సేయు, పాహికల్యాణ సుందరరామ, ఎవరుతెలియను, రామ రామ గోవింద, శ్రీరామ జయ రామ శ్రితజన—మొదలైన కీర్తనల్లో తన బాల్యంనించీ ముసలివాడయేదాకా తన దోషాలూ, పాపాలూ, లోట్లూ, దుష్కర్మలూ వాపోతూ పదేపదే చెప్పుకుంటూంటే గమనించక, అతడికి మొదణ్ణించీ వైరాగ్యమే, ఎప్పుడూ రాముడూ అతని భక్తులూ స్థూలశరీరంలో అతనికి కనపడుతూండే వారని ఎవరో చెప్పింది విశ్వసించడం ఎల్లా? మరో సంగతి, మనసా ఎటులోర్తునే, కంటజూడుమీ, నిన్నే నెర నమ్మి, అనేవాటిలో ఇకమీదట జాగర్తగానే ఉంటాను అంటాడేమిటి? అంతకు పూర్వమేనా చెడ్డవాడుగా ఉండేవాడా? తన చెడ్డతనం తనే హృదయపూర్వకంగా మనసు విప్పి చెప్పేస్తూండగా, అదంతా మొహమాటం కోసం తనమీద పెట్టుకున్నాడు అనడంలో న్యాయం ఏముండీ!

అన్ని అబద్ధాలు చెప్పడానికి 'హృదయం' అనేమాట బోలెడుసార్లు వాడిన త్యాగరాజు శబ్దాలే కాకుండా రాగ తాళాలు కూడా ఖర్చుపెట్టి ఉంటాడా ? అతని దగ్గిర నూరు పాళ్ళూ దివ్యత్వమే ఉండేది గాని, ఒక పాలేనా మానవత్వం ఉండేది కాదుట, అని నచ్చుచెప్పడం ఎవరికి ? ఏమిటి అందువల్ల పుష్టి ? పోనీ, సంఘాన్ని విసర్జించి ఊరుకోలేదే ? దుయ్యబట్టుకున్నాడు గాని. మళ్ళీ, ఆ బాదడంలో ఓ తట్టవరస తగిలించేశాడే !—మా పాల, తెలియలేరు, ఇందుకా పుట్టించితివి, అనాథుడను, నడచి నడచి, నళినలోచన, యజ్ఞాదులు, పదవినీ, తొలినేజేసిన, ఎవరైన, సరసీరుహానన, మేనుజూచి, అదికాదు భజన, విరాజ తురగ, కలిగరులకు, వరరాగ, ప్రారబ్ధమిట్టుండగ, ఎందుకో బాగా తెలియదు, మరియాద, గట్టిగాను నను, సత్తలేని దినము, ఇది సమయమురా, సరిజేసి వేడుక, పరలోక భయములేక, దుర్మార్గ, ఏమిజేసిన నేమి, రామ రామ కృష్ణా, నాదుపై బల్కెదరు—మొదలైన కీర్తనల్లో అతడు సంఘాన్ని దులిపిన దులుపులు కాసినీ కూసినీనా ? అతణ్ణించి ఇంత దెబ్బతిని వివిధమైన రచనా రూపంలోనూ ప్రతిధ్వనించకుండా ఎల్లా ఊరుకుందో సంఘం ! వీటిల్లోని అభిప్రాయం బోధపడని సంఘమూ అది ! తనని 'గారవించువారు లేరు' అంటాడేం ? సాహిత్యం మాట ఎల్లాఉన్నా సమ్మోహనాస్త్రం వేసినట్టు గానం చెయ్యగల నేర్పరి శత్రువుల్ని

కూడా ఆకర్షించగలడే, పశువులతోపాటూ! ఇతడి గానం వల్ల శత్రువులెల్లా ఏర్పడ్డారూ? ఇతడికి కనిపించారని ఇతరులు చెప్పిన వినాయక నారద రామలక్ష్మణులు ఇతడికి కనపడి చక్కాపోవడమే కాని, ఆ శత్రువుల్ని ఏమీ చేసినట్టు లేదే?

'చదివిన వాడనుగాను', రామకరుణవల్ల కావ్యం రచిస్తాను, తెలియకుండానే పద్యాలు రచిస్తున్నాను, అని ఎంతో వినయంగా అంటూన్నవాడిమీద కోప్పడడం ఎవరూ, ఎందుకూ? 'దురితంబులుపోను,' 'వినవా చెవులు' వేసినైనేను,' 'హితకరుడై బ్రోచితివే,' 'నన్నొకని బ్రోవ తెలియ గీర్తన శతకమొనర్చు త్యాగరాజనుత'—మొదలైన అన్వయాలు ఆచోట ఆ కాలంలో శిష్టసంప్రదాయాలనుకుంటే, తప్పులనుకునేకంటె, ఎంతనయం! శ్రీ రఘువర కరుణాకర, శ్రీ రఘువర సుగుణాలయ, అనుపమ గుణాంబుధి, రామసీతారామ,...పాలయరఘువీర,—మొదలైన వాటిల్లో ఆంధ్ర సంస్కృతాల్ని అలంకరించి చూపించాడే, సాధారణ గణగ్రాహికి తీసిపోకుండానూ! అచ్చ సంస్కృతాన్ని కీర్తనలు అన్నాడే! శ్లోకాలు పలికాడే! తేటగా ద్విపదలూ సీసాలూ రచించాడే! ఏ పదాల మూలంగా ఉత్కృష్టమైన సంగతి చెబుతూ తెలుగువాడి హృదయం తట్టగలిగాడో ఆ పదాలవల్ల ఏంవచ్చింది ఆపదా? 'రాగరత్నమాలిక చే' అనే కీర్తనలో తన కీర్తనలు—భాగవతోత్తములు గూడి

పాడేసి కీర్తనములు—అన్నాను. అంతేగాని రాగ లయమాత్రుడు ఒకడు తన పూర్వాభ్యాసమూ శాస్త్ర ప్రజ్ఞా కనపరుస్తూ కీర్తన మాటలు తనకే సయించనట్టు వాటిని నమిలేసి నొక్కేసి కక్కేసి శ్రోతల్ని నిరంతరంగా అర్థశూన్యతలో ముంచెత్తవలసిందని కోరలేదు. అతని ఉద్దేశంలో ఈ కీర్తనలు నిలిచిఉండవలసిన చోటు—భక్తి యొక్క అవసరం గాని ప్రమేయం గాని స్మరణగాని అణుమాత్రం ఉండని 'పాటకచేరీ'లలో మాత్రమేనా, లేక బృందాలూ సమాజాలూ సంఘాలూ కుటుంబాలూ చేరుకుని అందరూ పాల్గొంటూ అర్చనలూ ఆరాధనలూ పూజలూ భజనలూ జరిపే చోటకూడానా!

త్యాగరాజు కీర్తనలూ ప్రహ్లాద భక్తవిజయమూ నౌకా చరిత్రా పఠించి మననం చేసేటప్పుడు నాకు కలుగుతూ వచ్చిన సందేహాలు మనవి చేశాను. అవి సందేహాలే కాదు సహేతుకంగా పరిష్కరించుకోవలసిన సమస్యలని కూడా అంటున్నాను.

ఆ పనికి వీళ్ళమాటలూ వాళ్ళమాటలూ ఎందుకూ? స్వప్నవృత్తాంతా లెందుకు, కట్టుకథలెందుకూ? త్యాగరాజుమాటల్ని మించిన ప్రమాణం ఏమి ఉండగలదూ? అందుకని, కర్తవ్యం త్యాగరాజు కృతులలోని మాటలూ అవి సూచించే వృత్తాంతమూ జాగ్రతగా పరిశీలించడమే. పూర్తిగా ఆ వృత్తాంతం గమనిస్తే, ఎన్నో సమస్యలు విడిపోతాయి.

కృతి ఒక పని. ప్రతీ పనికీ కృతి శబ్దం వాడరు. కృతి ఒక మానవుడు తన పనివాడితనం చూపించి జనాన్ని ఆకర్షించి, హృదయస్పందనం చెయ్యగలపని. మానవ ప్రమేయం లేకుండానే నిర్మాణంపొంది జనహృదయాల్ని కదిలింపగలిగిన దాన్ని ప్రకృతి అంటాం. సారస్వతంలో గొప్ప కావ్యాన్ని కృతి అంటారు. సంగీతంలో ఒక పాటిగ మాటలతో కూడిఉన్నది కూడా కృతి కావచ్చును. ప్రతీ పద్యాన్నీ పట్టిగెళ్ళి కవిత్వం అనే శీర్షికకింద జమకట్టుగోడానికి వీల్లేనట్టే, ప్రతిపాటనీ లాక్కెళ్ళి కృతి అని పిల్చెయ్యడం కుదరదు. ఆరాధన పరంఅయినపాట-కీర్తన. ఏ కీర్తనయొక్క పదాలు కర్తఉద్దేశించినఅర్థభావాలతో, సూచించిన రాగంయొక్క నాదవిశేషాలతో, నియమించిన గమన స్ఫూర్తితో ఆచరింపబడి రచనకిపూర్వం కర్తపొందిన హృదయ వేదనయొక్క వైశాల్యానికీ గాంభీర్యానికీ మచ్చు చూపిస్తూ, ఒకే క్షణంలో అనేక హృదయాల్ని ఆకర్షింపగలవో ఆకీర్తన కృతి అనే పేరు పొందుతుంది. త్యాగరాజు కీర్తనలు అన్నీ కృతులే అనడానికి కాలమే సాక్షిఅయింది గనక మానవుల సాక్ష్యంమరి అవసరంలేదు. కీర్తనమాటల యొక్క భాగాలు ఇదివరకు సూచించాను. గద్య వాక్యంకంటె పద్యవాక్యం అన్వయించడంలో విశేషాలున్నట్టే, పద్యవాక్యంకంటె కీర్తనవాక్యం అన్వయించడంలో విశేషాలున్నాయి. ఒక్కొక్క ఉచ్చారణకి ఒక్కొక్క అన్వయం ఉంటుందా అన్నట్టువస్తుంది. చాలాసార్లు అనబడేది పల్లవి.

సార్థక కీర్తనయొక్క పల్లవిలో పొల్లుపదాలు కాదు సరికదా పొల్లు అక్షరంకూడా ఉండడానికి స్థలం ఉండదు. ఎంతో అప్రయత్నంగానూ సహజంగానూ తేలికగానూ సరళం గానూ కర్త అనేసినట్లు మనికి కనిపించినా, కీర్తన కర్త అక్షరం అక్షరం తూచి మరీ అంటాడని గ్రహించాలి. పల్లవియొక్క మొదటిమాట అందులో ఉండగల భావానికి ప్రారంభం అనుకోకూడదు. పల్లవిలో రెండు వాక్యాలున్నా, పల్లవీ అను-పల్లవీ చెరో వాక్యమూ అయినా, పల్లవీ అనుపల్లవీ కలిపి ఒకే వాక్యం అయినా పల్లవీ అనుపల్లవీ కలిపితేగాని, కీర్తనకర్త ఆ కీర్తనలో మనకి అందియ్యదలచిన ముఖ్య సందేశంయొక్క అన్వయం సిద్ధించదు. చరణంలో ఎంత వృత్తాంతతం ఉన్నా ప్రతీ చరణంయొక్క చివరభాగాన్ని నేర్పుగా పట్టిగెళ్ళి పల్లవియొక్క మొదటికి అతికి పల్లవి చివరంటా వెళ్ళిన తరవాతగాని చరణభావం పూర్తే కాదు. అందువల్ల సామాన్యంగా పల్లవియొక్క పదార్థం సార్వత్రికమై ఉంటే దాన్ని వివరిస్తూనో సవిరిస్తూనో దానిమీద ఆధారపడి ఉండే ప్రత్యేక భావ భాగం అయి ఉంటుంది చరణం. చెప్పొచ్చేదేమిటంటే, ఒక్కొక్క కృతిలోని పదాలు మాత్రం చూస్తూ మాట్లాడితేనే, కర్త ఉద్దేశం నిర్ణయించుగోడానికి కావలసినంత గొడవపడాలి. ఇది అయి, మరి వీటి రాగమూ వీటితాళమూ కూడా చూసుకుంటూ ఆ సమ్మేళనం తను అనుభవించి, శ్రోతలు కూడా కేవలం ఆ అనుభవం కాకపోయినా అటువంటి అనుభవ

మేనా పొందగలిగేటట్లు చేసేవాడు సంగీతకుడు, లేక పాటకుడు. తెలిసి ఉండడం వేరూ ఆచరించడం వేరూకదా! పదజ్ఞులంతా కవులు కారు కాని కవులంతా పదజ్ఞులే. గానజ్ఞులంతా గాయకులు కారు కాని గాయకులంతా గానజ్ఞులే. లయజ్ఞుడు ప్రతీవాడూ లయకారుడు కాడు కాని లయకారుడు ప్రతీవాడూ లయజ్ఞుడే! కీర్తన రచించే కీర్తన కవి, కవీ గాయకుడూ లయకారుడూ కానక్కర్లేదు, కవీ గానజ్ఞుడూ లయజ్ఞుడూ అయిఉంటే చాలు. అల్లానే కీర్తన ఆచరించే పాటకుడు కవీ గాయకుడూ లయకారుడూ కాక్కర్లేదు, పదజ్ఞుడూ గాయకుడూ లయకారుడూ అయి తీరాలి. (గాయకుడు: అంటే శబ్దాలతో నిమిత్తంలేని కేవల నాద రచనతోనే ఒకే క్షణంలో అనేక జనహృదయాల్ని ఆకర్షింప గలవాడు). కీర్తనకవే పాటకుడు కూడా అయి ఉండవచ్చు. అటువంటివాడు చేసేపనిలో మాహాత్మ్యం ఏమిటంటే: అతడు పదసముద్రం, స్వరసముద్రం, కాల సముద్రం అట్టడుగువరకూ ఎరిగి ఉండడమే కాదు, దేశకాల పరిస్థితులవల్ల తనకర్మ పరిపాకంవల్ల తనకి అద్వితీయమైన హృదయాందోళనా, ఆవేదనా, ఆవేశమూ ఆజన్మమూ కలుగుతూనే ఉండగా వాటిని బహిర్గతం చెయ్యగలగడమే జన్మతారకం అనుకుని తన హృదయావస్థ ఎప్పటికప్పుడు, గద్యకవిలాగ కేవల పదాల్లోనో గాయకుడుమల్లే కేవల స్వరాల్లోనో లయకారుడుమాదిరిగా కేవల తాళాల్లోనో, పద్యకవి మోస్తరుగా పదతాళాల్లోనో, యంత్రగానుడు

చేసినట్టు స్వరతాళాల్లోనో, పద్యరాగుడు ఆచరించినట్టు పదస్వరాల్లోనో అనేస్తే తన హృదయానుభవానికి యథార్థ ప్రకటన జరగదని తెలిసి, పద — స్వర — తాళాల్లో, మూడూ ఒకదానిపని మరొకటి చెయ్యకుండా వేర్వేరు పనులు చేసిపెట్టగలవు గనక, ఆ మూడుసాధనాలూ కూడా దోహదంగా పనిచేస్తూ తన కనుకూలించేలాగ వాటిని కట్టెయ్యడం బుద్ధిపూర్వకంగా తలపెట్టి, పదార్ణవం (అంటే తన పదార్ణవం) లో మునిగి పదాలు తెచ్చి, స్వరార్ణవం యొక్క అవగాహన చేసుకుని తనహృదయానికి సన్నిహితం అయినవే కాక అప్పుడే వెలిసిన పదాల యొక్క అర్థ భావాల్ని రసవత్తరం చేసే స్వరాలు ఏరి, ఆ రెండిటి అపూర్వ నూత్న రసాయనిక సమ్మేళనా ఏ గమనంతో సాగితే తన హృదయ స్పందనతో తుల్యమైన స్పందన తన జాతి హృదయాలకి కలుగుతుందో ఆ కాల ఖండాల్ని కాలార్ణవంలోంచి గ్రహించి, కీర్తనకి రూపం సిద్ధింపచేసి, అంతే కాక, తనకి తోచి నప్పుడు త్రిమూర్త్యాత్మకమూ అనిపించే ఆ కృతిని ఆచరించి ఒకే సమయంలో చాలా మంది చేరి ఒకరి ఆనందం ఒకరు పంచుకుంటూ ఆస్వాదించేలాగ జనాన్ని ఏకం చేసెయ్యగలగడం! అదీ కీర్తన కుడూ పాటకుడూ ఒకడే కాగలిగి నప్పటి దివ్యత్వం! త్యాగరాజు కీర్తనకుడూ పాటకుడూ కూడా నని దేశ, కాలాలు ఒప్పుగున్నాయి. అతడు రాముణ్ణి హృద్రాజీవంతో పూజచేశాడు గనక, తను అనుభవించనిది అక్షర

మేనా అనలేదు గనక, అతని కీర్తనల్లో సార్థకం కానిది ఉండదు, లేదు. వంద రాగాలమీద కీర్తనలు రాయడం తలపెట్టి రెండు వందల రాగాలు నాద లోకంలోంచి వెలికి తేగలిగాడు. అతని కీర్తనలు అతని మాటలే చెప్పాలి. వాటి వృత్తాంతం చెప్పబూనడం సాహసం. ఎవరేనా అందుకు అడ్డుపడడం నేరమేమో కూడానూ. అయినా, అతడి చిత్తక్షోభ ఆంధ్రుల్లో పైతైనంత మందికి తెలియాలీ అంటే, రాగతాళాల్ని ఎడంగా పెట్టి అతడి మాటల్ని ప్రత్యేకించి గమనించి తీరాలి.

కీర్తనమాటలు చిరకాలం కర్తమాత్రమే ఎరిగిఉంటాడు. క్రమేపీ అతణ్ణి ఆశ్రయించే శిష్యుల్లో ప్రియుడు అవి నేర్చుకుంటాడు. రిస్తూంటాడు. మాటలకి కొంతమార్పు వస్తుంది. గురుకుల వాసంలోకూడా ద్రోణాచార్యులు దొరకడం ఎంతకష్టమో అతనికి అర్జునుడువంటివాడు దొరకడం అంతకంటె కష్టం. కొందరు ఆ కీర్తనమాటల్ని ఇతరులకి చెప్పక మంత్రాక్షరాల్లాగ అట్టేపెట్టుగుంటారు. ఆ మాటలు వెల్లడైపోతే, తమ కంఠంకంటె మంచి పీకగలవాడు ఆ మాటల్తో విజృంభించేసరికి తమ గానానికి విలవపోతుందని వాళ్ళభయం. ఒక్కొక్కప్పుడు గురువుకిగూడా అదేభయం ఆ శిష్యుడిదగ్గిర్నించి మరోరి దగ్గిరికి అది వెళ్ళేసరికి ఆ మారినమాటల్లో మళ్ళీ మార్పులుంటాయి. కాని కీర్తన నిర్మాణంలో ప్రతీపాదంలోనూ యతీ, ప్రతీ రెండుపాదాలకీ ప్రాసా, ఒక్కొక్కప్పుడు అంత్యప్రాసా అనుప్రాసా.

మొదలైన బిగింపులు ఉండడంవల్ల, కీర్తనమాటలు కేవల గద్యరచనలోని పదాల్లాగ దిక్కూ-మొక్కూ లేకుండా ఉండవ్. ఏమైనా, కర్త తన మాటలయొక్క యధార్థ రూపం నిర్ణయించనప్పుడు, కొన్ని చిక్కులు తప్పవ్. అవేనా అక్షరాలూ, ఒత్తులూ, సంధులూ లాంటివే అయుంటాయి గనక; నిరాశ అవసరంలేదు. త్యాగరాజు 1847 లో గతిస్తే, 1870, 1880 ప్రాంతాలకి ఆయన పద్ధతిప్రకారం ఆయన శిష్యులదగ్గిర కూడా గానకృషి చేసినవాళ్లు అరితేరి ఉంటారు. అనాంధ్రులే ఆకృషి మొదట్లో చెయ్యగలిగిన భాగ్యం ఉండడంవల్ల, వాళ్లు తమ గానాభివృద్ధి కోసమే ఆ మాటలు తీసుకున్నారుగాని, ఆ మాటల్లోని వృత్తాంతాన్ని ఇతరులకి హృదయంగమం చేసే ఉద్దేశంతో గానం చెయ్యలేదు. గానం తమదిదే అని ఎంత అనుకుంటేం గనక, అర్థం తెలియని అన్యభాష మాటలుకూడా పాటకుడు ఉచ్చారణ చెయ్యవలసిన కర్మం తప్పదుగనక, త్యాగరాజు తెలుగు కీర్తనలకి, ఋష్టివాడి బాధయొక్క మొరలకి, ఆ దేశంలో శ్రోతలు పల్చనైపోయి ఉంటారు. ఆ నాటికి ఆంధ్రదేశం తెలుగు మీరడమూ, వీరేశలింగ యుగం ప్రారంభం అయి చురుగ్గా పని జరగడమూ, అనాంధ్రులు తమ గానకృషీ, శాస్త్రసామర్థ్యమూ ప్రకటించేటట్టు పాడడం నేర్చుగున్న తెలుగు కీర్తనలను పట్టుగుని తెలుగు

దేశం రావడమూ, గానశాస్త్రం అభ్యసించే నిమిత్తం
స్వరాలకి సూచకంగా తమరు పెట్టుకున్న స-రి-గ-మ-ప-
ద-ని లకి ఎంత అర్థమో తమరు అనవలిసొచ్చిన ఇతర
అక్షరగణాల కన్నింటికీ అంతే అర్థంగావును అనుకోగలిగిన
పాటకులు కీర్తనలు ఆచరించడమూ, తెలుగు కీర్తనల్లోని
సొగసూ సారస్యమూ సంపూర్ణంగా ఆస్వాదింప చెయ్య
డానికి తెలుగు రానక్కర్లేదనీ, తెలుగు రాకుండా ఉన్న
వాడుగాని పనికిరాడనీ గ్రహించి, విలవకట్టగలిగిన ఆంధ్ర
గాన పోషకులు ఆవిర్భవించడమూ,—— మనం ఎరుగుదుం.
త్యాగరాజు వంటివాడు పెరగడానికి తెలుగుసీమ సరియైన
క్షేత్రం కాదని భగవంతుడు గ్రహించి, దూరదేశంలో
ఒకణ్ణి తయారుచేసి వాడిచేత తెలుగువాళ్ళకి శతాబ్దాలకి
సరిపడ్డ తెలుగు కీర్తనలు రాయించిపెట్టగా, తెలుగుదేశం
వెళ్ళి అతణ్ణి గుర్తించుగుని, ఆ మాటలు తెచ్చుగుని ఆ
అక్షరాలన్నీ బంగారంతో చెయించి ధరించలేదు సరికదా,
మనకెందుకు పోదూ అనుకుని, అచ్చేనా వెయించలేదు.
అక్కడివారే పుణ్యాత్ములు ఆ కీర్తనలు సేకరించి,
వాట్లకి గ్రంథరూపం ఇచ్చి తంటాలు పడ్డారు. వాటిల్లో
ఎన్నితప్పులున్నా సరే (ఎవరికి లేవు?) వాటినినిలబెట్టారు గనక,
ఆ పనీ ఏ పనీ కూడా చెయ్యని తెలుగు వాళ్ళు, వాళ్ళకి
సాష్టాంగ నమస్కారం తెంపలేసుగుని చెయ్యాలి. నేను చూడ
గలిగిన గ్రంథాలలో ఉన్నవి 594 విడి కీర్తనలు, ప్రహ్లాదలో

45 నౌకాచరిత్రలో 21 కీర్తనలూ కూడా ఉన్నాయి. వాట్ల సంగతి ఆ కావ్యాల వృత్తాంతాల్లో వస్తుంది. పై 594 కీర్తనలలో కొన్నిగాని చాలాగాని త్యాగరాజు చెయ్యలేదా ఏమిటి అనే భయం నేను పడను. 'శ్రీ నారదముని రాయ' అనే కీర్తనలో మాత్రం త్యాగరాజు స్పర్శ నాకు గోచరించటం లేదు. 'నారద గురుసామి' తో పోల్చినా, మొదటిది త్యాగరాజు చట్రంలోది కానట్టు కనపడుతుంది. ఆ కీర్తనయొక్క కర్తృత్వం ఒక్కటే నాకు సందేహం.

వ్యక్తియొక్క జీవిత విశేషాల పౌర్వాపర్యం గాని, హృదయం ఆవిష్కరణ పొందిన క్రమంగాని తెలియాలంటే కీర్తనలు పుట్టిన కాలాలక్రమం చొప్పున ఉండేలాగు సంపుటీ చెయ్యడం వాంఛనీయం. త్యాగరాజుని గురించి అంతకంటె ముఖ్యమైన విషయాలే ఇదమిత్థం అని ఇప్పటికీ తేలకుండా ఉంటే, ఆ క్రమం ఎక్కడ తెలుదీ! ముందు ఏదో క్రమంలో వేశారు. సంపుటంలో ఏ కీర్తన ఎక్కడుందో త్వరగా పట్టుకోడానికి వీలుగా అకారాది పట్టిక వేశారు. ఏ రాగం మీద ఏమేమి కీర్తనలున్నాయో త్వరగా తెలుసుకోడానికి మేళకర్త రాగాల క్రమాన్ని మరోటి ఇచ్చారు. దేవతల్నీ పూజల్నీ గురించిన శీర్షికల కింద విభజన చేశారు. కాని, ఈ క్రమాల్లో మనిషీ దొరకడు మనిషి-తవేదనా ఈ విభాగాల కింద ద్యోతకం కాను. త్యాగరాజు తనే వెయ్యి

వేల మొలలు పెట్టుకున్నాను అన్నాడు. ఏకీర్తన యొక్క ప్రత్యేకత్వం దానిదే. అవి శీర్షికలకిందికి రావు. అయినా, కొన్నికొన్ని కీర్తనల్ని కలిపి చూసినప్పుడు సమగ్రభావం ఏర్పడుతూండడం వల్ల, నేను త్యాగరాజు విడికీర్తనల్ని తొమ్మిది శీర్షికల కింద గమనించి మననం చేశాను.

(1) త్యాగరాజు తన మనస్సునే సంబోధించి చెప్పినవి. (64)

(2) రాముణ్ణి ఉద్దేశించి అతణ్ణే సంబోధిస్తూ ఉన్నవి (331)

(3) జనంతో అన్నవి (12)

(4) ఇతరుల్ని ప్రశంసిస్తూ రాసినవి (50)

(5) అనుభవసారం గలవి (28)

(6) కలికాలాన్ని నిందించేవి (32)

(7) సగుణత్వాన్ని నిరూపించేవి (18)

(8) దేవభాషలో ఉన్నవి (41)

(9) పూజావిధానం గురించినవి (28)



ఛమిడిపాటి కామేశ్వరరావు

జననం ఏప్రిల్ 1897. పాఠశాలా విద్య - ఏలూరు, నర్సాపురం. కాలేజీ చదువు - కాకినాడ, రాజమహేంద్రవరం. 1918 లో బి. యే. (గణితశాస్త్రం). 1922 లో యల్. టి. నాటినించి వీరేశలింగం హైస్కూలులో గణితాధ్యాపకులు. ఆ పాఠశాల ప్రధానోపాధ్యాయులుగ జూన్ 1953 లో ఉద్యోగ విరమణము. పద్యపఠనంమీదా అభినయంమీదా ఆసక్తి కలవారు.

జీవితంలోని వాక్చమత్కృతుల సేకరణ మొదటి కృషి. 'భారతి' కి 1926 నించి సంబంధి. చమత్కార సంభాషణలూ 'త్యాగరాజు ఆత్మవిచారం' అనే త్యాగరాజ రచనల సారమూ ప్రకటించారు. భాగయ్య, పర్వతాలు, శఠకోపం, శానయ్య, మాలోకం మొదలైన పాత్రల పరిచయం సర్కార్లలోనూ, రాయలసీమలోనూ, నైజాం ప్రాంతాలలోనూ కలిగించారు. ఇటీవలి నాటకాలూ కథలూ ప్రశంసలూ అచ్చు కానున్నవి.